

శ్రీ

# సుగుణమణి.



(ఒక కల్పితనాటకము.)

## వల్లూరి బాపిరాజుగారిచే

రచియింపఁబడినది.



ఐదవకూర్పు 2000 ప్రతులు.

రాజమహేంద్రవరము.

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణిముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1922.

ఇందు వచ్చుపాత్రలు.

పురుషులు.

---

1. కళారత్నము — కథానాయకుఁడు.
2. చిత్రకేతుఁడు— శ్రీనగరవాసి, సుగుణమణితండ్రి.
3. శ్యామకేతుఁడు—చిత్రకేతుని కుమారుఁడు.
4. చంద్రసేనుఁడు —కళారత్నమునకుఁ బరిచయుఁడు.
5. విజయసేనుఁడు— ఒకమార్గస్థుఁడు.
6. ఇద్దఱుబ్రాహ్మణులు.



స్త్రీలు.

---

7. సుగుణమణి—కథానాయిక.
8. కళావతి — చిత్రకేతునిభార్య.
9. చారుమతి, మంజువాణి—సుగుణమణి స్నేహితురాండ్రు,
10. ఒక పరిచారిక.
11. ఇద్దఱుస్త్రీలు.

# సుగుణమణి.

——:)o(:——

## ప్రథమాంకము.

---

రంగము:—శ్రీనగరములోఁ జిత్రకేతుని ప్రమదావనము.

ప్రవేశము:—సుగుణమణి, చారుమతి.

---

సుగు—

మ. తరుణీ! చూచితె యీలతన్ ద్రుమము సాంద్రంబున్ మహారమ్యమున్
వరపుష్పౌఘసమన్వితం బగుచు దివ్యత్సౌరభోపేతమై
కరముద్వేలగతిన్ విశాలముగఁ బ్రాకన్ జొచ్చెఁదాఁ గోరు స
త్పురుషన్ జేరిన వ్రోత్పలాక్షి తనకూర్మిల్ బంపుచందంబునన్.

చారు—(చిరునగవుతో) చెలీ! యెంత భావగర్భితముగాఁ బలికితివే.

సుగు—నీబోఁటి ప్రౌఢయువతుల కవి భావగర్భితవచనంబులుగాఁ దోఁచును గాఁబోలును?

చారు—ఆహా! యేమినీవు ముగ్ధవలె వచియించుచుంటివి ఎప్పటినుండి యిట్టి ముగ్ధవచనంబులాడ నేర్చుకొంటివమ్మ. మొన్న నుకశారత్మ పమాగతసమయంబుననుండియుఁ గాఁబోలు. తెలిసినదిలే నీసాభిప్రాయవచనంబులు గట్టిపెట్టు మింక.

సుగు—(కొంచముసిగ్గభినయించుచు) చెలీ! చారుమతీ! దానికేమిగాని సకలసౌభాగ్యసమన్వితం బయి, సంతోషజనకంబయిన యీ చేమంతివనంబును గనుగొంటివా?

మ. వరుసన్ బూర్తిగఁ బూచినట్టి కుసుమవ్రాతంబులు న్గాన్ని, నుం
ధరమాచుండి సగంబుదోచిన ప్రసూనశ్రేణులు న్గాన్ని, మో

దరసంబిచ్చెదుఁగుట్మలంబు లొక చెంత న్గొన్ని, చెన్నార, సుం
దరాశాఖాన్వితమైన రమ్యమగు విద్యాశాలను న్గొబలెడిన్.

చారు—బాగుగనున్నది. (కొంచెము ముందునడచి) చెలీ! సుగుణమణి! ఈవకుళవృక్షంబును జూచితివా? (అప్పుడొక చిన్న గాలివీచుట చేఁ బుష్పంబులు జలజల రాలుచున్నవి.)

సుగు—(సుఖము నభినయించుచు) ఆహాహా

చ. మన మిట వచ్చునంతటనె మంజుల సాంద్రసుమౌఘవర్షముల్
తనువునఁగూర్చి సౌఖ్యము ముదంబును నిచ్చి, మనంబు దన్ని, పెం
పెనయఁ గరంబు నీవకుళవృక్షము మన్ననఁజేసి నిల్చెడిన్
గనుగొను మిట్లుగాదె గుణగౌరవము ల్గలవారినెయ్యముల్.

సుగు—వనితామణీ! ఈనవపుష్పసంతానంబులు గొన్ని తీసికొందమే. (ఇద్దఱునట్లు చేయుచున్నారు. ఆఘ్రాణించి) ఆహా! ఈకుసుమంబు లెంత లలితసౌరభ్యంబు లిచ్చునే.

చారు—అదియేగదా వీనియందు గౌరవాధిక్య మింతగా, గలిగియుండుటకుఁ గారణము. (ఇద్దఱు నడచుచున్నారు.)

సుగు—(ఒకగులాబిపూవును గోయుచున్నది.)

చారు—(వెనుకకుతిరిగి) రావేమి సుగుణమణీ! (చేరవచ్చి) దానిఁగోయలేకపోతివేమి?

సుగు—అందుకొనలేకపోతినే చెలీ! నీకందునేమో చూడుము.

చారు—కొంచెమటులెమ్ము. (కోయుటనభినయించుచు) అబ్బా! నాకును నందినదికాదే. ఇక్కడీముళ్ళకొమ్మగ్రుచ్చుకొనునని భయముగా నున్నది. కాని లేనియెడలఁ గోయుదునుసుమా.

సుగు—ఎంతగడుసుదానవే; నాకునుఅదేయడ్డమువచ్చినది. లేనియెడల నేను గోయకుందునా.

చారు—అందుచేతనే గదా సుగుణసంపద్ధురీణుల సాంగత్యము దుర్లభమందురు. (చిఱునగవుతో) నే నొకయుపాయమును జెప్పెదను జేసెదవా? నీచేతిరుమాలునీకొమ్మకుతగిలించుము. కొమ్మక్రిందకు వంగును. అప్పుడు మన మాపుష్పంబును గోసికొనుటకు సమర్థులమగుదుము.

సుగు—ఆహా! చాలు చాలు నీప్రౌఢవచనంబులు. నీచేతిరుమాలేల తగిలింపరాదు?

చారు—కార్యార్థినివి నీవుగాని నేనుగాను. అందుచేనీకట్టియుపాయము చెప్పితిని.

సుగు—నీవటు తొలఁగుము నేనీసారి ప్రయత్నించి తప్పకకోసెదను. (ప్రయాసపడి కోయుచున్నది.)

చూచితివాకోసితిని.

మ. తరుణార్కాంచితవర్ణము న్గలిగి, విస్తారంబుగా విచ్చి, సుం
దరమై, సద్గుణశోభనం బయి, మహానందంబు గావించి, సు
స్థిరసౌఖ్యాంబుధిఁదేల్చుచు న్ఘనుల కెంతే మోద మర్పించి, స
చ్చరితున్బోలిన యీగులాబిఁ బొగడ న్శక్యంబె యెవ్వారికిన్.

చారు—ఆలేగొమ్మలమధ్యను పక్వఫలంబును మెసవుచున్న యాశుకరాజంబునుగనుంగొనుము. (వ్రేలితోనొకవృక్షమునుజూపును.)

సుగు—ఎక్కడనమ్మ? నాకుదృగ్గోచరము కాలేదు.

చారు—అదిగో నావ్రేలునకుఁ దిన్నగజూడుము. నీకుగనఁబడును.

సుగు—అదియా! కనుపడినది. కనుపడినది.

చారు—ఆఫలంబును మనమెట్లైన సంగ్రహింపవలయును.

సుగు—వద్దు వద్దు అట్టియూహాలుమానుము క్షుద్బాధాపీడితమై ఫలంబును మెసవుచున్న యాశుకరాజంబుయొక్కయాహారము బోఁ

గొట్టి మనము గ్రహించియానందించుటయుత్తమకార్యంబుగాదు రమ్మటుపోయికూర్చుందము. చెలియా! సంగీతధ్వనివినవచ్చుచున్నటులున్నది. బాగుగ నాకర్ణింపుము.

చారు—(వినుటనభినయించి) మనచెలి మంజువాణికంఠస్వరముకాదా ఇటువచ్చుచున్నటులున్నది.

రాగము:—నాటకురంజి, తాళము:—ఏకతాళము.

మంజు—(తెరలో) మిగులచోద్యముకదా కనుమా సకియా
(ప్రవేశించి) సాంధ్యరాగమిదే హా! కనుమా సకియా
సుమజాలముల్, పూచెనెయందమై
మనమున కిం పొలయ, కనుమా సకియా.
వరుసల్ గట్టి, చనునే, పులుగుల్
కొలకొలగూయుచునే, కనుమా సకియా.
వాతపోతము, హాయిగనిచ్చునే
నవనవసౌరభముల్, కనుమా సకియా.

సుగు—చెలీ! మంజువాణి! చక్కగఁబాడితివి. రమ్మిటు. ఇచ్చటఁజల్ల గాలి నారగించి కొంతతడ వయినతరువాత యిండ్లకుఁబోదము.

[అందఱును కూర్చున్నారు.]

చారు—సఖీ! నీవింత యాలస్యముగ వచ్చితివేమి?

మంజు—నీవునన్నుఁబిలచికొనియిచ్చటికిఁదీసికొని వచ్చెదవనియోచించి యాగితిని. నీవెంతవరకును రాకుండుటచే నేను బయలుదేరి యిచ్చటి—కేతెంచితిని.

చారు—నిన్నుఁ బిలువవలెనని మొదట నూహించితినిగానియట్లుచేయ లేకపోతిని. క్షమింపుము.

మంజు—అట్లే. దానికేమిలే. సకియా! సుగుణమణీ! నిన్నటిసంభాషణ మీదినమున తిరిగి యారంభింతమా?

సుగు—అట్లే. ముఖ్యముగా నారంభింతము.

చారు—బాగుగజ్ఞప్తికిఁ దెచ్చితివి. మంజువాణీ! సుగుణమణీ! తమ పిల్లలవివాహవిషయములోఁ దల్లిదండ్రులు వారి యభిప్రాయంబులఁ బుచ్చుకొనవలయుననినీవువచించినవాక్యములు మాకంతఁ దృప్తికరములుగా లేవు.

సుగు—మీ రాపలుకులసత్యము బాగుగఁ గ్రహింపనివా రగుటచేఁ దృప్తికరములుగా నుండలేదు. తమయిచ్చవచ్చినవానిఁదీసికొని వచ్చి తమపిల్లలకు వివాహము సేయుటకంటె ఆవిషయములో వారియభిప్రాయంబు దీసికొనుట మంచిదికాదా?

మంజు—మంచిదయిననుసరే చెడ్డదయిననుసరేకాని పిల్లలయభిప్రాయంబు దీసికొనుట యనావశ్యకమని నాయభిప్రాయము. అదియునుగాక సాధారణముగ నట్టియాచారము మనజాతులలోఁ గనఁబడదు.

సుగు—ప్రస్తుతకాలములో నడుగంటియున్నదికాని పూర్వకాలములో వివాహంబులట్లే జరుగుచుండెనని వచించుటకు మనగ్రంథరాజంబులే ప్రబలనిదర్శనంబులు.

చారు—ఆగ్రంథంబులలోని స్త్రీపురుషులకును మనకాలములోని స్త్రీపురుషులకును విశేషతారతమ్యము గలదు. వారు విశేషవిద్యావిశారదులు. వారువివాహసమయంబునాటికివివేచనాశక్తిగలిగి భార్యాభర్తలు దామె వలచి గ్రహింప సమర్థులయి యుండెడివారు. ప్రస్తుతమన్నవో యొక్క క్షత్రియకులమందుఁ దక్కనితరజాతులయందు సర్వసామాన్యంబుగఁ జిన్ననాటనే వివా

హంబు లాచరించుటచే నట్టి విజ్ఞానసంపద పిల్లల కబ్బుట దుర్లభంబు. అట్టిస్థితియందుఁ దల్లిదండ్రులు వారియభిప్రాయంబుల వివాహమాచరించు టెట్లుసంభవించును?

సుగు — ఆలోచనముగూడఁ దల్లిదండ్రులదేగాని యితరులదిగాదు.

మంజు — నీవు క్షత్రియకులజవుగాన నిట్టియూహను వెల్లడించి యట్లు లొనరించుట యుత్తమమనియోచించితివి. కాని మావలె విప్రకులస్త్రీవైనచో నిట్టియభిప్రాయమును దెలియపఱుచుటకుఁ బ్రయత్నింపవు.

చారు — బాగుగఁబలికితివి మంజువాణీ! మిక్కిలిచిన్నతనంబున నే వివాహంబులు సేయుచుండుటచే మేమంతరము కొంచె మించుమించుగా వివాహముయొక్క యర్థమేమియో గ్రహింపఁజాలక యొకసంతోషజనకమైన కార్యముగా నెంచుకొనుచుంటిమిగాని దానియందుఁగల లాభములు దెలిసికొనఁజాలకున్నాము.

మంజు — మరియు వివాహమునాటికి విద్యాగంధ మణుమాత్రమైన నుండకపోవుటచే మేము స్వతంత్రించి మాభర్తలను వలచునంతటి సద్వివేకము మాకుండు టెట్లు తటస్థించును. అట్టి సద్వివేచనాశక్తి కొంచె మీడువచ్చినంగాని కలుగదుగదా. ఈడు వచ్చినను గార్యము లేదు. విద్యాప్రవేశము గలిగి యనుభవజ్ఞానము కలుగవలయును. ఈ రెండు కార్యములు నెరవేరుటకు మాకులములో జరుగుచున్న యాచారవ్యవహారములు ప్రబలాటంకములై యున్నవి.

చారు — చెలీ! మంజువాణి పలికిన పలుకులన్నియు సత్యములు. మీ కులమునందైనను పిల్లలయభిప్రాయంబులు దీసికొనుట యాచారముగ లేదని నా యభిప్రాయము.

సుగు—నిజమే ఏకాలమునందైనను సరేకాని, వారియభిప్రాయంబులు దీసికొనుట యుత్తమమని నేనూహించెదను.

మంజు—నీవు వచించినవాక్యమునందు నిజమున్నది. కాని ప్రస్తుతకాలములో జరగుచున్న వివాహకార్యంబులఁ దలంచుకొనినచో నీయూహ సరిపడదు. మిక్కిలి చిన్నవయసున నుద్వాహంబులు జరుగుచుండుటచే జ్ఞానసంపద చాలదు.

సుగు—అట్టిజ్ఞానసంపద కలుగఁజేయుట తల్లిదండ్రులకు విధికృత్యమై యున్నది తమయిచ్చవచ్చినవారికిఁ గట్టిపెట్టినతరువాత యాభార్యాభర్తలన్యోన్యానురాగులై యుండక విశేషబాధలకు లోనై యుండునపుడీతల్లిదండ్రులాబాధలఁ జూడనేరరుగదా. అదియునుగాక యట్టిదాంపత్యములో నిజమయిన సౌఖ్య మావంతయునుం గలుగదు. తల్లిదండ్రులుకూడ తగినన్ని యుద్యమములు గావించి మంచిసంబంధములు సంపాదించి పిమ్మటఁ దమ పిల్లల యభిప్రాయంబులుగూడఁ బుచ్చుకొనినచో శ్రేయోదాయకంబయి యుండునుగదా!

మంజు—నీవు వచించిన వాక్యములన్నియు సత్యములే. అన్యోన్యానురాగము లేకపోవుటచే దంపతులుపడుచున్న యిక్కట్టులుమనకన్నులారఁ జూచుచునేయున్నారము. అయినను జేయఁదగిన ప్రయత్నము లంతగాఁ జేయుటకు సావకాశము లేకున్నది.

చారు—చెలీ సాయంతనమయినది. మనయిండ్లుదూరముగనుక మనము పోవుదమురమ్ము.

సుగు—మీరు గృహంబులకుఁ బోయెదరా? నేనింక కొంతతడవిచ్చట నుండి యింటికి బోయెదను.

మంజు—మంచిది మేముపోయెదము.

(మంజు, చారుమతి నిష్క్రమించుచున్నారు.)

సుగు—వారు విప్రకులజ లగుటచే నే వచించిన యాచారము వారిలో లేనందున దానిలోని సత్యము గ్రహింపఁజాలరైరి. అయినను నిజ మాలోచించినచో నేఁజెప్పినది సౌఖ్యదాయకమనియే నా యభిప్రాయము.తమ భార్యాభర్తల నరయుటలో నన్ని ప్రయత్నములు పిల్లలమీఁదనే వదలివేయు టంత శ్రేయస్కరము గాదు. తల్లిదండ్రులు మంచి సంబంధముల నారసి తమ పిల్లలయభిప్రాయంబులు దీసికొనినన్యాయము గానుండును. అట్టుల జేయక తామేసర్వాధికారమువహించి చిన్నతనమున నేతమపిల్లలకు వివాహ మాచరించినఁ బరిహాసపాత్రంబుగా నుండును. జీవితకాలమంతయు నన్యోన్యకార్యాలోచనాతత్పరులై, సంసారబాధ్యతనంతయువహించి,యన్యోన్యసౌఖ్యాసౌఖ్యంబుల కాధారభూతంబులై యీప్రపచంబునఁ గాలంబు గడుపఁబోవు దంపతులు తామయిచ్ఛవచ్చినవారిఁ గోరక తలిదండ్రులు చిన్నతనంబునఁ గట్టిపెట్టినవారి కనుబద్ధులై యుండు టేమిశ్రేయోదాయకంబు?

(కొంచెమాలోచించుచున్నది.)

[కళారత్నము ప్రవేశించుచున్నాఁడు.]

కళా—(తనలో) ఆహా! మంచిసమయము దొరకినది.

సుగు—(స్వగతముగా) దైవకృపవలన వారికి ననురాగ మంకురించినచో నాదాంపత్యము సౌఖ్యదాయకంబయి యుండును. లేనిచో లెక్కలేని కష్టంబులుపుట్టి ప్రమాదజనకమై యుండును. అట్టి సంగతులు సాధారణముగ ప్రతివారి యనుభవములోఁగనబడుచునే యున్నవి. సాధారణంబుగ నన్యోన్యానురాగంబు సహజంబుగ నంకురించుట యట్టి యంశములలో నరుదు.

కళా—ఈమె యేదియో వివాహవిషయంబున నిశ్చలమానసంబుతో నాలోచించుచున్నట్టు లగుపడుచున్నది.

సుగు—చిరకాలమునుండి యట్టి గట్టియూహాను నెమ్మనంబునఁ గలిగి యుండి యెల్లప్పుడుఁ బరాత్పరుని ప్రార్థించుచున్న నాసంగతి యే మగునో కదా! ప్రస్తుతాంశమునుబట్టి చూచిన నట్టివైరుద్ధ్యము సంభవింపదని నాయభిప్రాయము.

కళా—తెలిసినది ఈమె యూహ.

సుగు—ఇంతవరకు నేను దృఢమనస్కురాలనై యున్నదానను. కాని యొకవిషయములోఁ జింతఁబొందుచున్నాను.

కళా—ఆవిషయ మేమైయుండునోగద, త్వరలో నాచింతపోవును గాక.

సుగు—నేటికి మూఁడుదినములక్రిందట నాప్రియమిత్రుఁడు కళారత్న మిచ్చటి కేతెంచినను నాయన దర్శనలాభంబు సంభవించినది కాదుగద. ఎట్లు దొరుకును?

[ఆలోచించుచు చింతిలుచున్నది.]

కళా—ఆహా! ఇదియా యీమెచింత. నేనుబోయి యామె యెదుట నిలుతునా? (సుగుణమణివైపు చూపునిగిడించి) ఆహా! ఆమె యాకృతి యెంత శృంగారముగా నున్నది.

మ. చిగురుంగే లొకచెక్కిట న్నిలిపి, కొంచెంబున్ దల న్వంచి పై
గగనం బీక్షణసేయుచుండి, సతమున్ గన్రెప్ప లల్లార్చుచున్
వగ నాలోచన సేయునీమెఁ గనుఁగొన్నన్ సన్మరుత్పంక్తిచేన్
మిగులన్ వంచన సేయఁబడ్డ దమయంతీకాంతతోఁ జేన్ మదిన్.

ఇఁక కొంచెముకాలము వేఁచి పిమ్మటఁబోయెదను. ఇంతలో నామె యూహాలు సమగ్రంబుగఁ దెలియును.

సుగు—ఆహా! మాకులములో నిట్టియాచార మెంత యన్యాయముగా నున్నది. మగపురుగు కంటబడుటఁ బరిహాసముగానున్నది. ప్రాణసమానులైన మిత్రవరేణ్యులగూడఁ జూడకుండుట మిగుల సంతాపభాజనంబు.

కళా—(తనలో) నిజము, ముద్దుగుమ్మా! నిజము.

సుగు—నాప్రియమిత్రునిఁ జూచుట కెన్నిప్రయత్నములు చేసినను వీలు చిక్కకున్నది. ఏకాంతస్థలంబునఁగలసి మాటాడవలయును. ఏమి చేయుదును? ఆయనసందర్శనలాభంబు నాకు దొరకదు. ఇంటికిఁ బోదునా? (లేచుటకుఁ బ్రయత్నము సేయుచున్నది.)

కళా—అయ్యో! యింటికిఁ బోవునాయేమి? నాప్రయత్నములునిష్ఫలములగునా? ఇంకను లేచి యింటికిఁబోవు ప్రయత్నములు పూర్తిగఁ జేయలేదు ఇఁకఁ గొంచెమునే సాగి చూచెదను.

సుగు—పోవుటకుఁ బాదంబులు రాకున్నవి. ఏమి చేయుదును? మనంబంతయునా ప్రాణమిత్రునిమీఁదనే యున్నది. అయినను గార్యమేమి? నిస్పృహఁ జెందవలసినదే.

(మరలఁబోవుటకుఁ బ్రయత్నము సేయుచున్నది.)

కళా—ఈమారు నిజంబుగ వెళ్ళిపోవునేమో. నేనుపోయి యెదుట నిలుతునా? నామనంబు మిగుల తహతహ లాడుచున్నది. అయినను గొంచెము చూచెదను. ఈమె మానసముఁ బరిపూర్తిగఁ బరీక్షించెదను.

సుగు—(లేచి) దైవమా! మాకిద్దఱకు నెంత స్నేహ ముండినను నేమి ఫలము? మనోనేత్రములతో నాతోడునీడ యయిన యామహామహునిఁ జూచికొనవలయునేగాని ప్రస్తుతములో నీస్థూలనేత్రంబుతోఁ జూచుపాటిసౌఖ్యంబు నాకబ్బునా?

(ఆశ్చర్యముతో నిలుచున్నది.)

కళా—(తనలో) అబ్బ కేమి ప్రియసఖి! నీమనోనాయకుఁ డిచ్చటనే యుండియున్నాఁడు ఆహా! నేనుమిగులదురాత్ముఁడనై తిని అట్టులఁ బరితాపంబు నొందుచున్న నాసఖిలలామను గష్టపెట్టుటనిందా పాత్రంబుగాదా.

సుగు—ప్రస్తుతములో నిస్పృహ జెందవలయును కొద్దికాలములోనే
దైవము మమ్ములను కలుపునుగాక.

కళా—(తనలో) తథాస్తు.

సుగు—ఎట్లు మనంబు నొప్పించినను విచారము మాత్రము బోయినది
కాదు. (ఆలోచించి) ఏమిచేయుదును? ఇంక నింటికిఁబోదును—
ఒకసారి యాకళ్యాణవిగ్రహము నాయెదుట నిప్పుడు నిల్చెనేని
నాపరమానందంబువర్ణింపఁదరమగునా? లేనియెడల దుఃఖాకుల
చిత్తనై యింటికిఁ బోవలయును మాచివి. నడచుచున్నది.

కళా—(తనలో) ఆహా! ఇఁకఁగార్యము మించినది. ఎదుటకుఁబోయి
నిలిచెదను. (ముందుకుఁ బోయి సుగుణమణినిఁ గలసి)

చ. వల దిఁకఁ జింత సేయుట లవంబు సఖీమణి! చూడు నీదు నె
చ్చెలి వనసీమ డాగినినుఁ జేరక నీవచనంబులన్ గుతూ
హలమున నాలకించుచు మహావిపదంబుధి నిన్ను ముంచి యి
ప్పుడు నిలుచున్నవాఁడు మునుముందర నైపఁక దేప్రమాదమున్.

సుగు—(వందనమాచరించి) మీ రట్లనఁ జెల్లునా?

చ. మిముఁ గనుఁగొన్నయంతటనే మిత్రవరేణ్యమ! నాదు మానసం
బమలత నొందియుండె నది యంత్రము వెల్వడు నీటిభంగి, ని
క్కము మిముఁ జూడఁగోరి తమకంబు వహించు మనం బిదేమి చి
త్రమొ వచింపలేను కడురమ్యము లీకనరాని నెయ్యముల్.

కళా—నీకననేల? నాకును నట్లేయున్నది. ముద్దుకోమలీ!

మ. వనితల్లేరొ వరింప నీధరణిలో, వారిన్ విలోకింపనో
కననో వారిమనంబు లెల్ల, గుణసంఘంబు ల్వినన్ లేదొ, యే
కనకాంగి న్వరికించి చూడఁ జెలి! ని న్గన్గొన్న యట్లుండదే
మొ నిజం బాపరమాత్ముఁడే యెరుఁగు సమ్మోదైకభావంబునన్.

సుగు — ప్రస్తుతము మీావచనంబుల దృఢముగా నమ్మియుండుటకుఁ దగినంత సావకాశముగనుపడదు. దైవకృపవలన మనమిద్దఱము గలసియుండినపిమ్మటకదా మీాపలుకులలోని సత్యముఁ గనుఁ గొనుటకు సమర్థురాల నగుదును.

కళా—సుదతీమణీ! నీ కంత యపనమ్మకము పుట్టుట మిగుల నాశ్చ ర్యంబుగా నున్నది.

ఉ. చిన్నతనంబునుండి కడుస్నేహమునం జరియించు చుండి, నీ కన్నసుహృజ్జనంబు లేకఁ గానర టంచుఁ గరంబు నమ్మి, యె న్నెన్నొ విపత్తులం బడి మహీస్థలి ని న్వరియించి యున్న నన్ జిన్నతనంబు సేయదగునే యిపు డీగతి సుందరీమణీ!

సుగు—మిత్రవర్యా! మీారు వచించిన పలుకులన్నియు సత్యమే బాల్యం బున మీారిచ్చట విద్యాభ్యాసంబు సేయుచు దినంబులుగడుపు చున్న సమయంబులో మీారు పొందిన కష్టంబులుగొంచెమించు మించు నేనన్నియు నెఱుంగుదును. అట్టికష్టసమితినంతయు దాటి ప్రస్తుతము సుఖోపజీవులయి యుండియున్న మిమ్ములఁజూడ నాకుఁ బరమప్రీతి జనించుచున్నది. పిన్ననాటనుండియు మీాయం దత్యంతానురాగతత్పరమతి నైయున్న నేనిప్పుడు మీాస్థితి నంతయుఁజూచి నాప్రేమానురాగం బెప్పుడు కొనసాగునని మిగులఁ దపించుచున్నదానను.

కళా—ప్రియసఖీ! నేనును మన సమాగంబునకు నట్టులే పరిపరి విధం బుల దైవంబును బ్రార్థించుచున్నవాఁడ. ఎన్నడు నెరవేరునో తెలియదు. నేను రేపటిదినంబున బయలుదేరి పుష్పగిరికిఁబోవు చున్నవాఁడ. కాన నిన్నుఁ జూచి మాటాడి మరియుఁ బోవల యునని యూహించి యీాయేకాంతస్థలంబున కేతెంచితిని నా

యదృష్టవశంబున నీవీస్థలమున నున్నదానవు నేనుఁ గృతార్థుఁడ
నైతిని నామనంబులోని యలజడి యుపశమించెను. నాకు సెల
వొసంగెదవా పోయెదను?

సుగు—మీ రట్లనుటచే నాయెడద నీరగుచున్నది.

ఉ. మీ రిట కేగుదెంచి ప్రియమిత్రమ! మూడుదినంబు లాయె నే
తీరున మిమ్ముఁ జూతును మరిఁ గలసూరుము లెట్లుదెల్పు దం
చారయు చున్నవేళఁ బరమాత్మకృపన్ గనుఁగొంటి నిచ్చటన్
మీ రిపు'డేగుచొతుఁ దరుణీ! సెలవిమ్మ'న నేఁ జెప్పుదున్.

కళా—నీమ్రోలనిలచి యెల్లపుడు సౌఖ్యంబుగదినంబులుగడపుటకంటె
నాకు వేరొండు సంతోషమే లేదు. కార్యాంతరమున నుండుటచే
ముందర నాపనిఁజూచుట విధాయక కృత్యమైయున్నది. కావునఁ
బుష్పగిరికిఁ బోవలయును. నీవు విచారింపఁ బనియేమి? దైవ
కృపవలనఁ గొద్దిదినంబులలో మనము కలసి మెలసి కాలంబు
గడపు దివసంబులు వచ్చునుగదా.

సుగు—నిజమే. అయినను ప్రేమాతిశయంబునుబట్టి యెంతకొద్దికాలం
బైనను గొప్పగాఁ గనుపించి వత్సరశతంబులవలెఁ దోఁచును.
రేపే పోయెదరా?

కళా—నేను రేపటి దినంబున నిన్నొకసారి యిచ్చటఁజూచి మఱియుఁ
బోయెదను.

సుగు—నాకంతకంటెఁగావలసినదేమున్నది.మనమింకనింటికిఁబోదము.
(ఇద్దఱును జెరియొక ప్రక్కను నిష్క్రమించుచున్నారు.)

రంగము—చిత్రకేతుని గృహములో నొకగది.

ప్రవేశము:—చిత్రకేతు, శ్యామకేతు.

చిత్ర—కుమారా! ఏదియైన ముఖ్యమయిన సంగతి నొకదానినినాలో
చించు చుండినతరి నది నెరవేరువరకు మనంబు మిగుల నలజడి

బొందుచుండుట సహజమై యున్నది. అది నీయనుభవములో నున్నదా?

శ్యామ—నాయనుభవములో నున్నది. అదియునుగాక మీప్రస్తుతములో నాపలుకులు వచించుటకును గారణముం దెలిసికొంటిని. కాని యీస్వల్పవిషయములో మీరంత తొట్రుపాటును బొంది మనంబుం గలవల మొందఁజేయునంతటికారణము నాకు దోఁచకున్నది.

చిత్ర—నీవు పిన్నవయస్కుఁడవు గావునఁ బ్రపంచానుభవ మంతగా లేకపోవుటచే నిట్లు వచించుచుంటివి నిజముగఁ జూచినచో మన మాలోచించువివాహవిషయము స్వల్పవిషయముగాదు.

శ్యామ—సాధారణంబుగ వివాహవిషయంబులు స్వల్పవిషయంబులు కాకపోయినను బ్రస్తుతాంశము మాత్రమంత విచారణీయము కాదని నాయభిప్రాయము. ఎందుచేతనన నీసంగతి యిదివరలో నిర్ధారణముం జేసికొని యున్నాము.

చిత్ర—నిర్ధారణము జేసికొని యుండలేదు.

శ్యామ—కళారత్నమున కిచ్చుటకు మీరలంద రభిప్రాయపడి యుండలేదా?

చిత్ర—అభిప్రాయపడినంతమాత్రమున నిర్ధారణమెట్లగును. అదియునుగాక మీతల్లి యీవిషయములో గట్టియాటంకము పెట్టియున్నది. మరియు నేనయినను నిశ్చయాభిప్రాయము గలిగియుండలేదు. మనవారిలోఁ బలువు రడ్డపెట్టుచునే యున్నారు.

శ్యామ—ఇట్టియాటంకముల మీరాలోచించినచో ననేకములుండును. ఇంతకును ముఖ్యమైనది మనసుగుణమణి యభిప్రాయముగద్దా.

చిత్ర—సుగుణమణియభిప్రాయముతో నిందులోఁబనియేమున్నది. మన యిచ్చవచ్చినవానిఁదెచ్చి పెండ్లిచేసినచో నామె పెండ్లియాడును.

శ్యామ—విద్యాబుద్ధులు నేర్చి జ్ఞానాజ్ఞానవిచక్షణాశక్తిఁ గలిగియున్న యామె యభిప్రాయంబుఁ దీసికొని యామె యిచ్చవచ్చినట్టు లొనరించినచో శ్రేయస్కరము.

చిత్ర—నీవు వచించిన మాట నిజమే కాని మనము వివాహము సేయు బాలుఁడైన నామె యిష్టమునకుఁ దగినవాఁ డయ్యె యుండును కాని యితరుఁడై యుండెఁడు. కళారత్నమువిషయం మాత్రము సందేహాస్పదముగా నున్నది.

శ్యామ ఇది మిగుల నాశ్చర్యముగా నున్నది.

మ. కడుబాల్యంబున వానితల్లి పరలోకప్రాప్తిఁ జెందఁగ మీ
రలు కారుణ్యమనస్కులై పెఱిచి, సంరక్షించి విద్యాసుబు
ద్ధులుఁ జెప్పింప, సుఖోన్నతస్థితుల నుద్యోగం బతం డంది, మి
క్కిలి మర్యాదను బొందుచుండె నిఁక శంకింపంగమీ కేటికిన్.

చిత్ర—నీవు వచించినట్టు లాతఁడు విద్యాధురీణుఁడై యున్నతస్థితియం దుండి మర్యాదను సంపాదించియే యున్నాఁడు. కాని మనస్థితి తో నాలోచించి చూచినచో నాతఁడర్హవరుఁడు కాఁడు. ఎందు చేతనన జిన్ననాటనుండియు మనయింటఁ బెరిగి మనపోష్యవర్గము నందుండి ప్రస్తుత మీస్థితిని బొందియున్నవాఁడు, కులశీలధనౌ దార్యస్థితులయందు మనతో సమానుఁడుండవలయును గాని, యితరుఁడర్హుఁడు కాఁడు. ఈతఁడు విద్యనుబట్టి యీప్రస్తుతావ స్థను బొందియున్న వాఁడుకాని చిరకాలార్జితమైనగౌరవసం పదలకలవాఁడు కాఁడు ప్రస్తుతస్థితినిబట్టి చూచినను నాతనిగౌర వంబునకు మనగౌరవంబునకును విశేషతారతమ్యము కలదు ఒకవేళ నాత్మబంధువుఁడైన మేనల్లుఁడని యాలోచించి నేనియ్య కొన్నను మీతల్లి మొదలగువారలు మిగులనన్ను నిందింతురు. నీవైనను బాగుగ నాలోచించినచో నిట్టివచనంబులు పలుకవు.

శ్యామ—తమరు పెద్దలగుటచే నుత్తరం బిచ్చుటకు మనంబు వెనుక దీయుచున్నది. అయినను న్యాయవాదిత్వమునం బట్టిభయంబు బొందుట న్యాయముకాదు గాన కొంచెము చెప్పెదనువినుండు విద్యోపార్జితమయిన గౌరవంబుకంటె ధనోపార్జితమైన గౌరవం బెక్కుడుకాదు. అదియునుగాక మనసుగుణమణిమనం బాతని మీఁదఁ దగులువడియున్నట్టు లగుపడుచున్నది. కావున నామె యూహ నెరవేర్చుట యుత్తమంబు.

చిత్ర—అది నిజమేకాని యామెయూహ సహేతుకమైన-చో నట్టులొనరింపవచ్చును. ఇంతకును మీతల్లియొంతమాత్ర మిందుల కొడఁబడదు. ఆమె యిష్టప్రకారము నడచుట శ్రేయోదాయకంబని తోఁచుచున్నది.

శ్యామ—సరే మీరట్లు చెప్పినచో నే నేమి వచింపనేర్తును.

[కళారత్నము ప్రవేశించుచున్నాఁడు.]

చిత్ర—కళారత్నమా! ఇటుకూర్చుండుము.

[కళారత్నము కూర్చుండుచున్నాఁడు.]

కళా—ఆర్యా!

మ. విహగంబుల్ తమ్రగుష్ఠులన్బ్రదివి సప్రేమంబున న్బిర్లలన్
బహుచిత్రంబుగఁ జేయురీతిఁ బసికూన న్నన్ను మీ రెంతయున్
మహదౌత్సుక్యముతోడఁ బెంచి కడు సన్మానంబున న్విద్య జె
ప్పిహృదిన్ వృద్ధియొనర్చినారిటులమీప్రేమల్ గనన్ శ్లాఘ్యముల్.

చిత్ర—నీవుబుద్ధిశాలివిగానఁ బ్రయాసమునకోర్చి విద్య నేర్చికొంటివిగాని నేనొనరించిన దణుమాత్రమయినలేదు. నీయదృష్టదినంబులు ఫలించినవికాన నీపరీక్షాసమునకుఁ దగిన బహుమానసంతోషయు సంభవించె.

కళా—ఆర్యా! మీరట్లనుట న్యాయముకాదు తమరునాతల్లిపోయిన పిమ్మటఁ జేరదీసి విద్యాబుద్ధులు గరపి యనేకవిధంబులఁగాపాడి తమంతవానినిగ నొనరించినారు, తమ రట్లాదుకొని నన్నువృద్ధి పరుపక పోయినచో నేనేమిగావలయునో యోచించుఁడు. ప్రస్తుతములో నేనొందిన యున్నతస్థితి యంతయుఁ దమ ప్రేమానుప్రాప్తఫలంబుగాని వేరొకటికాదు.

శ్యామ—బావా! నీవు వచించిన దంతయు నిజమేకాని మాజనకుని యుపకార మంతయు నీశ్రద్ధాభక్తులవలన వన్నెకెక్కినది.

చిత్రి—కళారత్నమా! నీయుద్యోగమునం దేమియు నుపద్రవంబులు లేక సుఖంబుగ నుంటివి గదా!

కళా—తమకరుణాతిరేకంబున నా కెట్టికొదువయును లేదు నాయుద్యోగంబు నా కమితసౌఖ్యదాయకంబై దినదినము తమయుపకార మహాత్మ్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. నాకింతకంటెఁ గావలసిన దేమున్నది?

చిత్రి—కళారత్నమా!

చ. నెరపుము కార్యపద్ధతుల నీతిపథైకరతుండవై, మహా
దరమునఁ జూడు భృత్యుల సతంబు జనాదరణీయకార్యము
ల్జరపు ప్రవర్తనంబు విమలం బగున ట్లొనరింపు మిత్రులన్
సరసత నాదరింపు మది సత్యమునందె వహింపు మెల్లడన్.

శ్యామ—తమ రొనరించిన సదుపదేశవాక్యములప్రకార మీవరకే యీతఁడు నడచుకొనుచున్నవాఁడు. ఈతని ప్రవర్తనాదివిషయములు నిర్దుష్టములని చెప్పుట కేమియు సందియంబు లేదు. మీరుకూడ స్వానుభవమువలన నెఱింగియేయున్నారు. మఱియు నితర బంధుమిత్రపరివారంబు లంద ఱీతనిసుగుణసంపద కత్యంతానురాగులయి యీతని యభివృద్ధినే సదా కోరుచున్నవారు.

కనుక యీతఁ డన్నివిషయములలో మనకు సహకారియై యుండఁ దగినవాఁడు.

చిత్రి—నీవు చిన్నతనంబునఁ బొందిన కష్టమునకుఁ దగిన ఫలము సంభ వించినది. ఇప్పుడు సుఖోపజీవుఁడవై చిరకాలంబు నీయున్నత పదంబునందు నుందువుగాక!

కళా—నిర్మలాంతఃకరణముతోఁ దమరు వచించినవాక్యములు వ్యర్థము లగునా? ఆర్యా! నే నిచ్చట కేగుదెంచి సుమారుమూఁడుదినంబు లాయెను. ఇఁక నిలుచుటకు వీలులేదు. కావున రేపటిదినంబునఁ బయలుదేరి పుష్పగిరికిఁ బోవలయునని యోచించుచున్నవాఁడ.

శ్యామ—రేపటిదినంబుననే పోవలయునా బావా.

చిత్ర—ఏమి అంత తొందరపడుచుంటివి. ఇఁకమూఁడు నాలుగుదివసంబు లాగుటకు వలనుపడదా?

కళా—కార్యాంతరవర్తినై యుండుటచేనాగుటకువలనుపడదనివచించు టకు మిగులచింతనొందుచున్నవాఁడ తమసాన్నిధ్యమునం దెంత కాల మున్నను నాకు సౌఖ్యమే కాని వేఱొకటికాదు. అయినను నే నేమి చేయగలను?

చిత్రి—మంచిది. నీ కున్న కార్యాంతరములకంటె మాయింటనుండుట ముఖ్యముకాదు గనుక నీవు పోవచ్చును. తరచు నీయోగక్షేమ ములు మాకుఁ దెలియఁబంపుము. మఱియును వీలుచిక్కినప్పు డొకసారి వచ్చి నీసాంగత్యలాభంబు మాకిమ్ము.

కళా—చిత్తము. నాకు తమకంటె నితరులు ముఖ్యు లెవ రున్నారు?

చిత్రి—(నిష్క్రమించు చున్నాఁడు.)

శ్యామ—బావా! అప్పుడేపోయెదవా నీవు వచ్చినట్లే యగుపడలేదోయి నీతో సరిగా ముచ్చటించుటకైనను వీలుచిక్కినదికాదు. ఇఁక రెండుదినంబులయిన నాగుము.

కళా—శ్యామ కేతు! ఇచ్చట నిలిచియుండుటకు వలనుపడదని చెప్పి యుంటినికదా. కనుక పోవలయును. వీలయినప్పుడెల్ల సాధ్య మయినంతమట్టుకు వచ్చుచునేయుందును. నీవుచింతఁ బొందనేల?

శ్యామ—నీవు పోయెదవని వినినప్పటియుండియు నామనంబు చింతచే పరితపించు చున్నది. అది యేమిచిత్రమో కాని నీయెడల నాకొకయపరిమితప్రేమాతిరేక మంకురించినది. దానికిఁ గార ణము వచించుట యసాధ్యము.

కళా—మీ కందఱికి నాయందుఁ గల భ్రాతృభావమే కారణము.

శ్యామ—మనల నెడ తెగనిబంధులతలతోఁ బరాత్పరుఁడుగట్టిపెట్టుగాక.

కళా—నేనును అందుకే దైవమును ప్రార్థించుచున్నాఁడ.

శ్యామ—మన మనుకొనిన యట్లు ప్రతిసంగతియు జరుగుట దుర్ల భంబుగదా.

కళా—ఏమి నీ వట్లనుచుంటివి?

శ్యామ—ఏమియులేదు సంశయింప నేల? లోకములో సాధారణంబుగ జరుగుచున్న సంగతి నేను వచించితిని. గాని వేఱొండు లేదు.

కళా—మంచిది దానికేమి ఎట్లగునో చూతముకదా మనము లోపలికి పోవుదము రా.

శ్యామ—మంచిది.

(ఇద్దఱును నిష్క్రమించు చున్నారు.)

ప్రమదావనము.

[సుగుణమణి ప్రవేశించుచున్నది.]

సుగు—(నలుదిక్కులను పరికించి చూచి) ఇంకను రాలేదు నేనే ముం దుగ నేతెంచితిని (కొంచెమాలోచించి)ఒకవేళ నాకంటె పూర్వ మే తెంచి యేదిక్కునన్నైన డాగియుండెనేమో (అటునిటుపోయి)

పరికించి చూచెద (వెదకుట నభినయించుచు) ఆహా! అనురాగ
ముతో సరియైనది యీప్రపంచమందు మఱియొకటి లేదుకద.

అనురాగము.

చ. అమితప్రయాశకైన హృదయంబును జొన్పడఁజేయు, నాత్మసౌ
ఖ్యము మదిఁ గోరనీదు లవమైన, స్వబంధులమీఁది మోహపా
శములను ద్రెంపివేయును, నిజంబుగ నొక్కొకవేళలోనఁ బ్రా
ణములఁ బరిత్యజింపఁగ మనంబును దేఁ బురికొల్పు నెంతయున్.

(మరల వెదకుట నభినయించుచున్నది.)

(వేళాకచోటకరిగి) అక్కడను గానరాకుండెనే. ఒకవేళ నిచ్చటి
కేతెంచియుండ లేదేమో! అయినను నలుదిక్కులు చూచెదను
గాక (కొంచెమునడచి)అదిగో ఇచ్చటనున్నటు లగుపడుచున్నది.
పోయి నిలిచెదను. (ముందునకు నడచి) ఆహా! బాగుగ మోస
పోతినే ఏమి! ఈ యాశ్చర్యము.

క. మనమున నొకనిఁ దలంచుచు
ననిశంబును వానిఁ జూచు నభిలాషమునన్
వనటను బొందుచు నుండఁగఁ
గన నయ్యెడు వానిరూపు, గాంచిన వెచటన్.

ఇది సాధారణంబుగ లోకములో నందఱికి ననుభవైక వేద్యమే.
(మరల వెదకుచున్నది.)

[కళారత్నము ప్రవేశించుచున్నాఁడు.]

కళా—(సుగుణమణినిఁ జూడక యే)నాప్రియసఖి యిటకు వచ్చియుండ
లేదు. ఏమి కారణమయి యుండును?

సుగు—(కళారత్నమువైపు చూచి) ఇదిగో నాప్రియసఖుఁడు వచ్చి
యేదియో యాలోచించుచున్నాఁడు. ఇచ్చటనే యాగియుండి
అతని పల్కులన్నియు నామూలాగ్రంబుగ వినియెదను.

కళా— ఉ. కారణ మేమొ, జెప్పినప్రకారమునన్ జెలి రాక యుండె నె
వ్వారయినన్ గ్రహించినఁ బ్రవాదము పెట్టునటంచు నెంచిరా
నేరక యుండెనో? మఱి వనీస్థలి కల్లన నేగుదెంచి న
న్నేరక మోసగింప నవనీజచయంబుల చెంత డాగెనో?

సుగు—(చిరునగవుతో) అహా! నామనోహరుని మనంబు తొందరపాటు
జెందుచున్నది. నేను బోయి యెదుట నిలిచెదను.

[అట్లుల చేయుచున్నది.]

కళా—(సంతోషాంతరంగుఁడై)

చ. కనుఁగొనలేక నిన్నిచటఁ గంది మనంబునఁ గుందుచుంటినో
వనితరో! నిన్నుఁ జూడ సమభారము జెందిన ప్రాణసీతి నా
మన మింక నిశ్చలంబయి సముచిత నిర్మలభావ మొందె నే
మని వచియించు వాఁడగదునక్క జముల్ మనస్నేహజాలముల్.

సుగు—మీకంటె నేనేముందుగ నేతెంచిమీరెచ్చటనైనడాగియుంటి
రేమో యని యోచించుచు వృక్షంబుల చాటున మిమ్మరయు
చుంటిని అంతలో మీ రిందుల కేతెంచితిరి.

కళా—చెలీ! యీవనము పూర్వముకంటె రమ్యతరమై యున్నది
సుమా! కొన్నివృక్షంబులు తరుణప్రాయంబువహించినవూతన
పుష్పసంతానంబుల నిచ్చుచున్నవి. ఇదియంతయు నీ యవార్య
శ్రీద్ధాగరిమవలనఁగదా వృద్ధిఁబొందినది. (ముందునకుఁగొం
చెము నడచి యొక వృక్షమును జూపి)

క. ఈసుమభూజము మనసహ
వాసుని నడిగికొని తెచ్చి పాతినదికదా
యోసుమసమగాత్రి! మిగుల
పాశ్రిత్త్యం భాచు నిద్ది రమ్యాం బయ్యెన్.

సుగు—ఆర్యా! మీవచనంబులు నాకుముళుకులువలెవినవచ్చుచున్నవి.

కళా — ఏమి? అట్లనుచుంటివి.

సుగు— మీరునన్ను విడిచిపోయెదరన్న విచారమేకాని మీపలుకులయందు నాకాసక్తి లేకున్నది. (ఒకగులాంబిపూవును గోసియిచ్చుచున్నది)

కళా —[కండ్ల నద్దికొనుచు]

చ. చెలి! యిటువంటి నీదు నును జెక్కుల నెప్పుడు ముద్దుపెట్టఁగాఁ
గలుగు నటంచు మానస ముఖాడవిషాదముఁ బొందుచుండె

సుగు — నీ

దళములఁ బోలియుండి పరిమదంబగు మీ రదనాంశుకంబు నె
ట్టుల లలయించునంచును గడుర్ మదిఁజింతిలుచుంటిమిత్రమా!

కళా--మనమనుకొనినప్రకారమిచ్చటఁగలసికొంటిమిగదా. సుగుణమణీ!

సుగు— విషాదభరితమానసంబులతోఁ గలసికొంటిమి గాని సంతోష మావంతయు లేదు.

చ. ప్రతినిమిషంబు మిమ్ముల నపారముదంబున నే స్మరించుచున్
మతి సకలంబు మీకిఁక సమర్పణ జేసితి మీరు నట్టులే
సతతము నన్ను మీహృదయసారసమందున నిల్పుఁడంచు నేఁ
గుతుకముతోడఁగోరెయిదిగో బహుమాన మొకండొసంగెదన్.

[స్వల్పచిత్రిని ర్మితమైన యొకచేతిరుమాలు నిచ్చుచున్నది.]

కళా —[రుమాలును ముద్దుబెట్టుకొని]

క. ఈలావణ్యావిలాసము
లీలోలరుచు లిటువంటి మృదులత్వంబుల్
మేలగు నీచిత్రిపుఁ బను
లేలా నిను మరువఁ జేయునే? సుగుణమణీ!

సుగు— మరువకుండుటకే గదా దీని మీ కిచ్చితిని.

కళా— దీనిని నీవీయకున్ననునిన్ను మరుపనుగాని నీవుప్రేమతో నొసం

గిన నీరుమాలు మాత్రము ప్రాణపదంబుగఁ జూచుకొని యెన్నడు నెడఁబాయకుందును.

సుగు — అదియే నాకుఁ గావలసినది.

కళా — (దగ్గరకుఁ జేరఁబోయి) సుందరీమణీ! మనమీస్థలము విడిచియింక పోవుదమా?

సుగు — (దీనాననయై నిలుచుండి యున్నది.)

కళా — సుగుణమణీ! ఇఁక నిచ్చటఁ దడవుండిన నెగ్గుపుట్టును. కావున ధైర్యమానసంబున నుండుము. నీకంటె నాకును విచార మతిశయించుచు నేయున్నది. కాని మనము చేయునది యేమియును లేదు.

సుగు — నెచ్చెలీ! మీరుబయలు దేరి పోయెద రనినమాట దలంచుకొనిన గుండె జల్లుమనుచున్నది. దాని కేమిగాని మిమ్ముల నొకకోరిక వేఁడెద, నట్టులఁ జేయుదురుగాక.

ఉ. మీ రిటనుండి పోయి యటుమీఁదట వేగ సురక్షితంబుగాఁ
జేరిన జాబు నంపుడు వచింతు నిజం బగుమాట మీసమా
చారము విన్నదాక నొకశంక జనించి మనంబునందు నా
హారము వైరమై యరుచి యయ్యెడు, నిద్దుర రాదు మిత్రమా!

కళా — ముఖ్యముగా నట్లే చేయుదును.

సుగు — (చేరంజని చిరునగవుతో నాతని హస్తములోఁ దనహస్తము నుంచుచున్నది.)

కళా — మనమింక పోవుదమురమ్ము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)



# సుగుణమణి

ద్వితీయాంకము.

సుగుణమణిగృహము.

[సుగుణమణి ప్రవేశించుచున్నది.]

సుగు——(ఖిన్నమానసయై) ఆహా! ఎంతటివింత సంభవించెను.

ఉ. ఇంచుక తెల్విలేక తమరే బహుజ్ఞానప్రసన్నులంచు భా
వించుచుఁ గాంతులన్ మిగుల వేసటఁబెట్టి, సతంబు వారి వం
చించి, కరంబు నన్యులను జిక్కుల ముంచు లతాంగు లెందు జీ
వించిన గార్య మేమి? కడువేగ గతించినఁ జాల మేలగున్.

(నిట్టూర్పు పుచ్చి) అయ్యో! ఆవిద్యాపారంగతుని చేతిమి సున్న
యేనా? కలనైన నిట్టిదురవస్థ సంభవించునని మనంబున నించు
కైన తలంపనైతిని. ఆసకలకళ్యాణగుణాకరుండగు నామనో
హరుండు వరుండగునని నిశ్చయంబుగఁ దలంచి యుప్పొంగు
లూరుచు నాయంతటి భాగ్యవంతురా లీధరాతలంబున లేదని
విఱ్ఱవీగుచున్న నన్నింతటి విపత్సముద్రమునఁ బడద్రోయ నీకుఁ
జెల్లునా? తల్లీ! నాజనకుండు కొంచె మీవిషయంబునసంతుష్టుండై
యున్నను విశేషముగాఁ బట్టుదల వహించి యున్నవాఁడు కాఁడు
గారామునఁ జిన్ననాటనుండియుఁ బెంచి యన్ని విధంబుల నన్ను
సంరక్షించుచు నామనోరథంబులీడేర్చుచునున్న నీవీసమయంబునఁ
గూడ నాముద్దు చెల్లింపరాదా? అమ్మా! నీవెందుచేఁ బట్టుపట్టియుంటి
వో నాకుఁ గారణంబు బోధకట్టకున్నది. అహాహా! (ఆలోచించి

ఉ. చింతిల నేమి కార్య మతిశీఘ్రముగాఁగ నుపాయ మొండుఁ గా
వింతము, లేకయున్నఁ బ్రభవించుఁ బ్రమాదము కాన భీతి యొ
క్కింతయు లేక ధైర్యము వహించి ప్రయత్నము లాచరించి య
క్కాంతుని జెట్టబట్టవలెఁ గా కటుతక్కినఁ జావగా వలెన్.

అహా యేమంటిని? (ఆలోచించును.)

మ. ఒకచాయన్ జనకుండు దీనికి విరోధోద్యోగముల్ జేయ, వే
ఱొకప్రక్కన్ జనయిత్రి యాతని కెదివ్యోపాయముం జెప్ప వాం
ఛకు నేనీతి విరోధి నౌచు నెదురాడ న్నేర్తు నయ్యయ్యో! యిం
తికి స్వాతంత్ర్యము లేనిజీవనము కంటెన్ జావె మేలెయ్యెడున్.

కావున నేనేమిచేయవలయును? ప్రథమమునుండియు నాకోరిక తప్పక నెరవేరునని యూహించి నాయభీష్ట మిప్పు డీడేరకుండునని విని నప్పటినుండియు నామనంబు మిగులఁ బరితపించుచున్నది. ఇప్పు డేమిచేయుదును? తొల్లింటి నామనోహరునిమీఁది యాసవిడచి యిప్పుడు నాజననీజనకు లొసంగు వరునివరింపవలయునా? (దేహము కపింపఁజేయుచు) ఆహా! ఆమాట తలంచుకొనినమాత్రఁబు ననే దేహము కంపించుచున్నది. ఇఁక నాతని వివాహమాడి సౌఖ్యము ననుభవించుటెట్లు? చిన్ననాటనుండియు నత్యంత ప్రేమాతిరేకంబున మెలంగుచు నొక్కపాఠశాలయందు విద్య నభ్యసించి యొక్కగృహమునం దాహారంబుఁ గొనుచు, నాట పాటలయం దైకమత్యముతోఁ గాలంబుఁ గడపిన మే మిద్దఱ మిపు డెట్టుల వేరు కాఁగలము?

ఉ. పిన్నటినాటియాట లతిప్రేమమునన్ భుజియించు చుండుటల్,
తిన్నగఁ బాఠశాల కరుదెంచుట లంత పికారుఁ బోవుటల్,
వన్నియమీరు పాట లతిప్రౌఢతరం బగుమాట లన్ని నా
కన్నులఁ గట్టినట్టు సరిగాఁ గనుపించెడు నిప్పు డక్కటా!

(నిశ్చేష్టురాలై యాశ్చర్యము నభినయించుచున్నది.)

కానీ! దైవముండియే యున్నాఁడు హా! దైవమా! విశేషప్రేమానుబంధ మెచ్చటఁ గలదో యచ్చటనె లెక్కలేని యిక్కట్టులును గల్పించుచున్నావుగదా. నీచరిత్రమహిమలు గనిపెట్టనసాధ్యములు; మనంబునఁ దలంచినట్లు లన్నికోరికలును నెరవేర్పవుగదా అప్పుడు గొన్నిశంకలు జనించుచున్నను నామనోభీష్టము నెరవేరునని నిశ్చయంబుగనమ్మియున్న నన్నిప్పుడు మోసగింప నుద్యుక్తుఁడవై యుంటివిగదా నిన్ననవలసిన పని యేమి?

ఉ. యత్నము లెన్నియేని యెటులైన నొనర్చి వివాహ మాశి మీ
పత్నిగ నెల్లవారు నను భావనఁ జేయు ముదంబుతోడ మీ
నూత్నసమాగమంబున వినోదములన్ సుఖియింప నోకళా
రత్నమ! యెన్నఁడైనను బరాత్పరుఁ డింక లభింపఁ జేయునా?

ఎవ్వరో వచ్చుచున్నటు లగుపడుచున్నది.

[శ్యామకేతు ప్రవేశించుచున్నాఁడు.]

శ్యామ—అమ్మా! సుగుణమణి! చింతాక్రాంతురాలవై యుంటివేమి!

సుగు—(దీనాననయై మారుపలుకకయే నిలుచుండి యున్నది.)

శ్యామ—చెల్లెలా! నీమనోదుఃఖమునకుఁ గారణంబుఁ బొడగట్టినది. దీనికై నీ వింతగాఁ జింతిల్ల నేల? నీ వీచింతను వదలి యెప్పటి యట్టుల నుండుము.

సుగు—అన్నయా! నాసంగతి నంతయు నామూలాగ్రంబుగ నెఱింగినవాఁడవు నీవేకదా! మన తల్లిదండ్రులయినను నీవిషయములో నంతగా నెఱింగియుండలేదు. మొట్టమొదటనుండియు కళారత్నమునందలి నాప్రేమానుబంధమును నాయందాతని యనురాగంబును నీవెఱింగియున్నదే ఇదియునుగాక మాయన్యోన్యానురాగంబులకు నీవుకూడ సహకారివై యీవివాహవిషయంబున బ్రయత్నంబులుఁ జేయుదునని నచియించి యుంటివి.

ఈసంగతు లన్నియు నీవెఱింగియుఁ బ్రస్తుతములో మనకు సంభవించియున్న విపత్తుల నెఱిఁగియు, నెట్టుల నన్ను చింతను వదలి వేయమని యడిగితివి ?

శ్యామ——సుగుణమణీ! నీవు చెప్పినసంగతు లన్నియు నిజంబులే అయినను బ్రస్తుతకార్యసందర్భములను బట్టి చూచినచో మన యూహ యణుమాత్రంబయినను నెరవేరదని నే తలంచుచున్నాఁడ. ఎందుచేత ననిన మనతల్లి యీవిషయంబున విశేషమయిన పట్టుదల వహించియుండి నిద్రాహారంబుల గూడ విసర్జించి యొక్కరీతిని పోరాటమున కారంభించినది మనతండ్రియుఁ గూడ నామెపక్షమే వహించి యున్నఁవాడుగాని మనకనుకూలుఁడుగా నుండియుండలేదు. ఇఁకఁ జిన్నవారమైన మనమెన్ని ప్రయత్నము లొనరించినను నిష్ఫలంబులగును గాన వేరొండు గావు. అదియునుగాక మనము మనతలిదండ్రులఁ గఠినంబుగా నెదరించి వారి మాటలఁ గాదననేరము ఎట్టుల నాలోచించినను జిక్కులే తటస్థించుచున్నవి కాని మరియొకటికాదు. కనుక మనముమనపట్టునువదలివేయుటయుత్తమంబనితోఁచుచున్నది.

సుగు——అన్నయా! స్థితిగతు లన్నియు నెఱింగిన నీవుకూడ నిస్పృహవచనంబులు పలుకుట నాశ్చర్యబుగ నున్నది. ఏదైన యుపాయంబు పన్ని మనయూహలు నెరవేర్పఁ బ్రయత్నింపవలయును గాని యిట్టుల నూరకొనినచో నే నేమిచేయవలయునో యెఱుంగకున్న దాన నూతనవరు డెవరో నీకుఁ దెలియునా?

శ్యామ——నాకావిషయము నిశ్చయంబుగఁ దెలియలేదు. పూర్వ మొకసారి మనమిద్దఱ మనుకొనినయాతనినే మనతలిదండ్రులు స్థిరపరుప యత్నించు చున్నట్టు లగుపడుచున్నది.

సుగు—అయ్యో! ఎంతటికష్టము ప్రాప్తించెను అన్నయ్యా! నీ వేమియు నుపాయము చెప్పవుకదా! సకలకళాపరిపూర్ణుఁ డగు నాకళారత్నముమీఁద ప్రేమానుబంధముఁ దెగకోయవలసినదేనా? ఆహా! ఎన్నఁడిట్టి దురవస్థ సంభవించునని యనుకొనియుండలేదు గదా. అయ్యయో! (కన్నీరు విడచుచున్నది.)

శ్యామ—(చేరంజని కన్నీరుఁదుడుచుచు) అమ్మా నాముద్దుచెల్లెలా!

ఉ. కన్నులనీరు కాలువలు గట్టఁగ నెందుల కేడ్చెదమ్మ నీ
కన్నవివేకశాలిను లిఁకఁ గలరమ్మ కళావిహీనవై
యున్నతెరంగుఁ జూడఁగ సహోదరి! యెవ్వరు మెత్తురమ్మ యీ
యన్నశరణ్యుమీఁద నిఁక భారము నుంచగదమ్మ పూనికన్.

సుగు—నీవు వచించుమాట లన్నియు నాకు వినఁబడుటయే లేదు. నీవు నాకీవిషయములోఁ దోడ్పాటుగాకుండిన నేను చేయున దావంతయును లేదు. కనుక సహోదరప్రేమ నాయందుఁ గనుపరుపుము.

శ్యామ—నీ కెన్నఁడును విరోధుఁడనయి యుందునని తలంపకుము. సాధ్యమయినంత వరకు నీమేలునకే యాలోచించుచుందునుగాని వేరొకటికాదు. కాని ప్రస్తుతాంశము మనకు మించినది అయినను నేను సర్వప్రయత్నంబులచేత నీ కనుగుణంబులగు కార్యంబులే చేయుచుంటిని. మనప్రయత్నము లేమగునో చూచెదము. మన మొకసారి మనతల్లిగారిని దర్శింతము వచ్చెదవా?

సుగు—వచ్చెదనుగాని మనలను జూచినతోడనే కాలాగ్నిరుద్రునివలె తీవ్రకోపమును జూపించుచు ఆసమయంబున మన మేదైన నుత్తర మొసంగిన నది యినుమడించును.

శ్యామ—మనము పోయి యామెకుఁ గోపజనకములైన పలుకులను మాటాడనేల? ఆమెస్థితి నంతయుఁ జూచి మన మానసమునకుఁ దగినట్లులే ప్రవర్తింతము.

సుగు——మంచిది పోదము రా. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

కళావతి గృహము.

[కళావతి ప్రవేశించుచున్నది.]

కళావ — ఇప్పుడు మన మాలోచించుచున్నది మన కన్ని విధంబులం దగి యున్నది. కాని యొక్క లోపము మాత్రము సంభవించియున్నది. అది యొక లోపముగా నెంచుకొనవలసినది కాదు, కాని మా సుగుణమణి యదియే యెక్కువ లోపముగా నెంచును అయినను భయము లేదు. ఎట్టులయినను మేము వచించిన మాటలు విని యట్టుల నడుచుకొనవలయునుగాని ప్రత్యుత్తరము చెప్పనగునా! నాకొమార్తె మానసంబు నేను చిరకాలమునుండియుఁ గనిపెట్టి యున్నాను. ఆమెహృదయం బంతయు నాకళారత్నముమీఁదనే లగ్నమయినట్టు లగుపడుచున్నది. ఇంతకును గారణ మాతని విద్యాప్రావీణ్యమే కాని వేఱొండు కాదు. ప్రస్తుతములో మేము తెచ్చినవరున కతఁ డావిద్యావిషయమునందుఁ దక్క మిగిలిన నన్నిటియందును దక్కువవాఁడే; నిజంబుగ విద్యయందు విశేష గౌరవ మున్నను గొన్ని లోపములయందు మాత్ర మది సహకారి కానేరదు. నాప్రాణనాయకునిమనంబింకను దేనియందును నిశ్చయమై యుండ లేదు. కాని యీ రెండవవరునియందే కొంచెము పక్ష మవలంబించినట్లు తోఁచుచున్నది. ఈయుద్దేశ మింకను గొన్ని నివారణవలన బలపరచెదను. అప్పుడు నామనోహరుండు కూడ నాపక్కనే మాటాడును. (ఆలోచించుచున్నది.)

[శ్యామకేతు, సుగుణమణి ప్రవేశించుచున్నారు.]

కళావ——శ్యామకేతు! రమ్మిటు. సుగుణమణీ! యటుకూర్చుండుము.

శ్యామ——అమ్మా! మనసుగుణమణి వివాహమును గురించి యేదైన నిశ్చయమయినదా?

కళావ—మీతండ్రిగారు నీతో నేమియు చెప్పియుండ లేదా?
శ్యామ—నాతో నేమియుఁ జెప్పియుండ లేదు.
కళావ—ఇంకను నిశ్చయం బేమియుఁ గా లేదు రెండుమూడు సంబంధము లుండియున్నవి అందులో శ్రేష్ఠమయినదాని నిశ్చయంబు చేసికొనవలయును.
శ్యామ—ఈ రెండుమూడు సంబంధములలోఁ గళారత్నముండియున్నాఁడా!
కళావ—(కొంచెమాలోచించుచు) లేఁడు లేఁడు. ఇవి వేఱుసంబంధములు.
సుగు—(విచారము నభినయించుచున్నది.)
శ్యామ—అమ్మా! ప్రస్తుతము మీరాలోచించినవరులు మన కళారత్నమునకంటె నధికులనియేనా యాలోచించుచుంటిరి అట్టియూహల నెప్పుడును మనంబున నిల్పకుఁడు భోగభాగ్యములయందుఁ గొంచెమీవరు లధికులై ననునితరవిషయంబులలో నణుమాత్రమును మనకళారత్నంబునకు సాటిరారని దృఢంబుగ నమ్మియుండుఁడు. ఈవచనంబులే మాతండ్రిగారితో నేనొకసారి చెప్పియుంటిని. కాని వారంతగా నీమాటల పాటిచేసినారు కారు. దీనికంతకును గారణము మీరనియే నేను చెప్పవలసియున్నది.
కళావ—ఈనింద నంతయు నామీఁద నే మోపితివా! నే నిందులో నీవు చెప్పినంత నిందార్హురాలను గాను మీతండ్రిగారు దీనికి ముఖ్యకారకులు (సుగుణమణివైపు తిరిగి చిఱునగవుతో) అమ్మాయీ! నీయూహ యెటులుండునో చెప్పుము ?
సుగు—(ఊరకుని యున్నది.)
శ్యామ—చెల్లెలా! ఊరకొనెదవేమి? నీయూహను జెప్పుము.
సుగు—నాయూహ యిపుడు వేరె చెప్ప నేల? మీరంద రెఱింగియే యున్నారు. అదియునుగాక నాయూహ మనతల్లిదండ్రుల కిద్దఱకయిష్టమే.

కళావ—అయిష్టమేమి? మేమెల్లపుడును నీసౌఖ్యసంపదలనే కోరియున్న వారముకాని వేరొండుకాదు. నిన్ను చిన్నతనంబునుండియు నతిగారాబంబునఁ బెంచి క్షేమలాభంబు లరయుచున్నవారముగాన యీవివాహవిషయంబునఁ గూడ నీమేలునకే ప్రయత్నించుచున్నవారము నీమనంబున నిల్పియున్న వరుఁడు కళారత్నమను మాట మేమందఱమెఱుంగుదుము. అతనికి నిన్నీయుటకు మేమంతగా నిశ్చయించి యుండలేదు. దానికిఁ గారణాంతరము లనేకములు గలవు బుద్ధిమంతురాలవు నీవాలోచించుకొనినచో నన్నియు నీకు బోధపడును. నేను విస్తరించి చెప్పనక్కరలేదు.

సుగు—అమ్మా! మీమాటల కెదురాడుటకు జంకుచున్నను ప్రస్తుతాంశమునుబట్టి ప్రత్యుత్తర మీయవలసి వచ్చినది. నన్ను బెంచి పెద్దదానినిఁజేసి విద్యాబుద్ధులు జెప్పించి నాసౌఖ్యానందములనునెల్లపుడుఁ గోరుచు నాయూహల నెరవేర్చుచున్న మీరిపు డీవిషయములోఁ గూడ నాయూహ నెందుచే నెరవేర్పరు.

కళావ—సుగుణమణీ! నీవు చిన్నదాన వగుటచే నీకు లోకానుభవమంతగా లేదు. మాచాటునఁ బెఱిగి కష్టనిష్ఠురములన్న నెట్టివో యెఱుగకున్న దానవుగాన నీపట్లు వచించుచుంటివి. మే మేకార్యమొనరించినను నీసౌఖ్యమునకే యని యాలోచించుకొనుము. నీకు రవ్వంత కష్టము సంభవించిన మేమోర్వఁగలమా బిడ్డా!

శ్యామ-మనమెల్లపుడు నామె సౌఖ్యమునుగోరుచుండుటసహజము మన సుగుణమణి చెప్పినదానిలో నిజానిజంబులనాలోచించి గ్రహింపవలయును. మనకళారత్నము మీరుగోరినయంశములలోఁగొంచెమించుమించుగా నన్నిటిలో సమానుఁడయ్యే యున్నవాఁడు.

కళావ—శ్యామకేతు! నీవును జిన్నవాఁడవు, నీకేమియును దెలియదు. పెద్దలమైమీకుఁదల్లితండ్రులమనియనుకొనుచున్న మాయిష్టము

వచ్చినప్రకారము చేయనిమ్ము. మనసుగుణమణి కావంతయును లోపము రానేరదు. అన్ని విధములచేతను గొంచెమించుమించు తగినవానినే యేర్పరచి వివాహము చేసెదము ఇంతకును నీవు తొందర నొందుటేల?

శ్యామ—వివాహమాసన్న మగుచుండుటచే తొందర జెందుచుంటిని, లేనియెడల తొందర యొంతమాత్రమును లేదు. నేను చెప్పవలసినమాట యింకొక్కటికలదు ఏదియెట్లులైనను సరేకాని మన సుగుణమణికోరిక నెరవేర్చుట యుత్తమంబు.

కళావ—దానికేమిగానిమీరుపోయి మీమీపనులు నెరవేర్చుకొనుడు. లేనిపోని సంభాషణలు పెద్దవారితో చేయకుడు సుగుణమణి! లెమ్ము. (శ్యామకేతు, సుగుణమణి నిష్క్రమించుచున్నారు.)

ఆహా! వీరితో గొప్పయాటంకము సంభవించినదే. వీండ్లనిద్దఱను నొప్పించుట బహుప్రయాసముగఁ దోచుచున్నది.(ఆలోచించి) వీరితో నేమి పనిచేయవలసిన దంతయు మనచేతిలో నేయున్నది. కదా.నాప్రాణనాయకుఁడుమాత్రము వీరిమాయలలోబడకుండ జేయవలయును. ఎన్నివిధములచేత నాలోచించినను గళారత్నమున కిచ్చుటకు నామనసు బొడఁబడకున్నది. అతనిఁ జూచిన నదేమిచిత్రమోగాని నాకుఁ గోప మంకురించును. నిజమాలోచించినచో నాతనియందు లోపము లేవియుఁ గానరావు గాని నాకుమాత్ర మాతనియందు మిగుల నయిష్టము కావున నీయంశములో విశేషముగాఁ బట్టుపట్టి నాపంతము నెరవేర్చుకొనవలయును. నాప్రాణనాయకుండును నామాటలఁ గొంచెమూమోదించును.అదియునుగాకయాయనగూడనీయంశములో గొంచెముపరాఙ్ముఖతఁ జెందియే యుండెను. అదినాకుసహకారి

కాకుండునా? చూతము ఇంకొకసారి కలసికొనినప్పుడు గాఢ
ముగ నీవిషయములో మాటాడెదను. ఈసరికి నేనుబోయెదను.
(నిష్క్రమించుచున్నది)

చిత్రకేతుని గృహములో నొకగది.

(చిత్రకేతు ప్రవేశించుచున్నాఁడు.)

చిత్ర—ఆహా! కూఁతులనుగనిన తల్లిదండ్రులకంటె నీధరాతలఁబునదుర
దృష్టవంతు లింకొరు గానరారు. ఎందుచేతనన

చ. తగినవరుండు చేకుదిరినదాక మనంబున నొక్కచింత సొం
పుగ నటుపైని వారి కతిమోహము లుండునొ మానునోయటం
చు గడువిచార మింక మనచూఁడ్కికి ముద్దులకూఁతు రెంతొ ద
వ్వగునని యెన్నరాని హృదయంబున వే రొకచింత వారికిన్.

ప్రస్తుతము నాస్థితియంతయు నట్టులనే యున్నది. ఏమిచేయుదును.
మానుగుణమణివివాహవిషయంబులో నందఱికిని గొంచెమించు
మించు వేర్వేరభిప్రాయములు గలిగియున్నవి నాయూహకును
నాభార్యయుద్దేశమునకు భేద ముండెను. మాయిద్దఱికంటె భి
న్నాభిప్రాయంబును నాకొమార్తె గలిగియుండెను. నాకుమారుఁ
డు చెల్లెలియభిప్రాయంబులో నేకీభవించియున్నట్టు లగుపడు
చున్నది. ఇట్టిదురవస్థలో నేనేమిచేయవలయునో తెలియకున్నది.
నాయభిప్రాయము తగ్గించుకొందమనిన నాభార్య నన్ను తిరస్క
రించును. ఆమెయుద్దేశమునే నెరవేర్చెదమనిన నాకొమార్తెకు
నయిష్టము. నాకొమార్తెయూహప్రకారము నడచుద మనిన
నాభార్య మిక్కిలి కోపగించును. ఇప్పుడు నే నేమిచేయుదును?
(ఆలోచించుచు) ఆయావరుల గుణాగుణతారతమ్యమును విచా
రింతును. మొదట నే నూహించిన వరునిగురించి యాలోచించి
నచో నాతనికి విశేషవిద్యాధిక్యత లేదు. భోగభాగ్యము లను

కూలముగా నున్నవి ఇఁక నాభార్యమనంబులోని పరుని జూచి నచో నాతని కణుమాత్రము విద్య లేదు. ఐశ్వర్యసంపద లఖండముగా నున్నవి. పోనీ! నాకొమార్తెయుద్దేశము పరికిం చెదను విద్యాసంపదయం దాపరుండపరసరస్వతియనియే చెప్ప వచ్చును. ధనాద్యైశ్వర్యము లిప్పు డేమియును లేవు. విద్యాధి కుండుగాన ముందుముందు విశేషధనవంతుండై ప్రఖ్యాతివడయ వచ్చును నేను తెచ్చిన వరునకును నాభార్యచూచిన వరునకును విశేషతారతమ్యము లేదు. కావున మేమిద్దఱు మొడఁబరుచు కొనవచ్చును కాని నాకొమార్తెమనంబులోని వరునకును మా వరులకును నత్యంతభేద ముండుటచే సమర్థించుకొనఁ జాలము. ఆసంబంధమైనను నిజంబుగ నాలోచించినచో నుత్కృష్ట మయి నదే కాని, కొన్నికొన్ని విషయంబులలో సందేహాస్పద మయి యున్నది. ఏమిచేయుటకును దోఁచకున్నది. నాభార్యపట్టుదల యీవిషయములో విశేషముగా నుండెను ఆమె మనోభీష్టము నెరవేర్పకపోయినఁ గష్టంబు లనేకములు సంభవించును.

(ఆలోచించుచున్నాఁడు)

[శ్యామకేతు ప్రవేశించుచున్నాఁడు.]

చిత్ర—శ్యామకేతు! రమ్మిటు. (శ్యామకేతు కూర్చుండు చున్నాఁడు.) కుమారా! ఏమి! నీవేదియో కార్యాంతరమున నేతెంచినట్టు లగుపడుచున్నది.

శ్యామ—కార్యాంతరమేమియును లేదు. ఒకానొకవేళనుండియున్నను మీకుఁ దెలియనిది కాదు.

చిత్ర—సరే, నాకు జ్ఞప్తికివచ్చినది. మనసుగుణమణి వివాహాంశములో నీవుచెప్పిన దంతసరిగా నుండియుండ లేదని తోఁచుచున్నది.

శ్యామ — ఏమి! మీరట్లు లూహించియున్నారు. కొంచె మాలోచించి నచో దానిలోని సత్యము మీకే బోధపడును. మీమనంబు నకుఁ దెలిసియున్నను మాతల్లిగారి బోధనవలన మీమనంబు కొంచెము మారుద్రోవ పట్టియుండెను. మీరువయోవృద్ధులరు, సుజ్ఞానసంపన్నులరు, అనుభవైకవేద్యులు. కావున నాడువారి మాట విని మీయూహను మరల్చుట యుక్తముకాదు. వారు వచించినదానిలో న్యాయ మున్నయెడల మన మానందముతో నవలంబింప వచ్చును. మీ రణుమాత్రమును నాలోచింపక యామె యుద్దేశమునే నెరవేర్పఁ దలంచుట మిగుల నిందార్హం బని నాయుద్దేశము.

చిత్ర—శ్యామకేతు! ఈవిషయంబున నామనం బింకను నిర్ధారణ చేసి కొని యుండలేదు ఊరక నన్ను నిడించవలదు.

శ్యామ — మీ రేమియునిర్ధారణచేసికొనకపోయినను సుగుణమణియుద్దే శముమాత్రము నెరవేర్పకుండుటకు నిశ్చయించుకొనియున్నారు.

చిత్ర—అదియును సందేహాస్పదముగానే యున్నది.

శ్యామ—తమ రీవిషయములో సందేహింపవలదు. తప్పక కళారత్న మును మనసుగుణమణికి వివాహము సేయుఁడు. అంతకంటె మీరు తెచ్చిన సంబంధము లుత్కృష్టతరంబులు గావని నాయభి ప్రాయము. అదియునుగాక మనకురక్తసంబంధుఁడు. పిన్ననాట నుండియు మనయింటఁబెఱిగి మన కనుకూలుఁడుగానున్నవాఁడు. మీరు విద్యాబుద్ధులు చెప్పించి వృద్ధిచేసినందుల కీయుపకారము గూడఁ జేసిన మీప్రయత్నములు సఫలీకృతమును బొందును. ఇదియునుగాక యిం కొకముఖ్యాంశము గలదు. మనసుగుణ మణిమనం బాతనియం దత్యంతానురాగంబు లగ్నమై యున్న యది ఆమెయూహ నెరవేర్చుట సర్వోత్కృష్టము.

చిత్ర—నీవు విశేషప్రయాసముతో సుగుణమణివైపు వాదించు చుంటివి మీతల్లి కిది యెంతమాత్రమును నిష్టములేదు. నా కింకను నంతగా నిష్టములేదు. అందులకుఁ గారణంబులు నీతో నిదివరకుఁ జెప్పియున్నాను. కనుక నాయుద్దేశము నెరవేరుట నశక్యంబని తోఁచుచున్నది.

శ్యామ—మీరట్లు వచించునపుడు నే నేమి చెప్పఁగలను. కాని మీ రాలోచించుకొనినచో నీయంశమున ననేకము లయినచిక్కులు సంభవించునని తోఁచుచున్నది. అన్యోన్యానురాగము లేనిదాంపత్య మెన్నడును సౌఖ్యదాయకంబు కానేరదని నమ్ముఁడు. ఆమాటమీర లెఱింగియేయున్నారు. నేను వేరేచెప్పనవసరము లేదు. అన్యోన్యప్రేమాతిరేకంబు లేనిదంపతులు పడుచున్న కష్టంబులు లెక్కలేకయున్నవి. అవి యన్నియు మీ రెఱింగియే యుందురు.

చిత్రి—దాని కేమిలే, కాని కళారత్నమునకొక్క విద్యాధిక్యతఁదక్క వేరొండు లేదు. దానినిబట్టి మనసుగుణమణి నాతని కిచ్చుట శ్రేయస్కరముగాదు.

శ్యామ—విద్యాధిక్యతకంటె మీరూహించిన యితర యాధిక్యత లన్నియు నెక్కువలనియా యాలోచించుచుంటిరి. ఎన్నడును గావని నాయభిప్రాయము. విద్యనేర్చినవాఁ డెన్నడును జెడిపోవ నేరఁడు మీరుకోరినప్రకారము ధనసంపదలున్నవారి కవి కాలవశంబున నశించినచో వారలు బిచ్చ మెత్తుకొనుటకైనఁ బనికి రారు. భాగ్యభోగ్యములుస్థిరంబులని నమ్మకుఁడు. అదియునుగాక విద్య నేర్చినంగాని యాధనమును యుక్తమగురీతిని వ్రయపరుచుట మొదలయిన సంగతులు తెలియవు. కావున దేనికైన విద్యయే ప్రధానము.

చిత్ర — అవును నీవు వచించినమాట నిజమే. అయినను ప్రస్తుతములో మనస్థితిగతులనుబట్టి యాలోచించినచో సునసుగుణమణిని కళారత్నమున కిచ్చుట యుక్తముగాఁ దోఁచ లేదు.

శ్యామ — మీకు నిష్టము లేదుగావున యుక్తముగా నున్నట్టుతోఁచదు. అటుపయిని మాతల్లిగారి పట్టుదల యొకటి విశేషముగా నడ్డు పెట్టుచున్నది. ఇట్టియసందర్భము లన్నియు సంభవించుచున్న పుడు నామాట లేమి నెరవేరగలవు? ఇంతకును సుగుణమణి ప్రాప్త మెటు లుండునో.

చిత్ర—సుగుణమణి కేమియు లోపము లేదు. ఆమె నన్నివిధములచేత సుఖపెట్టుటకే యత్నము సేయుదుముగాని యామె కష్టంబుల కిచ్చగింతుమా?

శ్యామ—మీరు నిజంబుగ నామెసౌఖ్యంబునకే యాలోచించినచోఁ దప్పక యామెను గళారత్నమున కిండు. లేనిచోఁ గష్టంబులు సంభవించునేమోయని భయము పుట్టుచున్నది.

చిత్ర—ఏమియు భయము లేదు. ఆమెతో నేనుగలసి మాటాడియామె నొప్పించెదను.

శ్యామ—అటులయినసరే. ఆమెతో మీరుస్వయముగఁ నీవిషయమును మాటాడెదరని వినినంతమాత్రంబున నాకు సంతోషంబు పుట్టు చున్నది. ఏమనని ఆమె తమతో నామెయూహ లన్నియుసమ గ్రంబుగా వచించుటకు వీలుండును. అప్పుడు కొంచె మయ్యది శ్రేయోదాయకంబై యుండు కానిమీరు కళారత్నముమాట మరువవలదు. ఏరీతినైన మాతల్లిగారితో నీసంగతి మాటాడి యామె మనంబును ద్రిప్పివేయుటకుఁ బ్రయత్నింపుఁడు.

చిత్ర—మీతల్లి యీవిషయములో నెన్నిచెప్పినను వినునట్లు తోఁచుట లేదు.

శ్యామ—మీరు గట్టిక చెప్పినచో నెందుచే వినకుందును? మీకును నామె యూహయే మనంబున గాఢముగానాటుకొనియున్నది. కనుక యీసంగతియందుమీయుభయుల యభిప్రాయంబులును నేకీభూతములే. నేను సెలవుతీసికొనెదను.

(శ్యామకేతు నిష్క్రమించుచున్నాఁడు.)

చిత్ర—మంచిది ఇంతవరకు సంభవించినదిగదా. శ్యామకేతు చాల దూర మీవిషయంబున జెప్పుటఁ జూచ సుగుణమణి యాతనిని పంపించునట్లు తోఁచుచున్నది. అతఁడు చెప్పిన మాటలయందు గొంచెము సత్యమును గాన్పించుచున్నవి. మఱియొకరీతినాలో చించినచో నట్టిపనిచేయుటకు మనంబు గొంకుచున్నది. ప్రస్తుతములోఁ గళారత్నమునకు భోగభాగ్యములు లేకున్నను నాతని స్థితినిబట్టియాలోచించినచోఁగొద్దికాలంబులో నేవి శేషధనవంతుడగునట్టు కనఁబడుచున్నది. అతని ధనమునకు మన మాసింప నేల? మనము విశేషసమర్థులమయి యుంటిమిగాన వివాహ సమయంబునఁ దగురీతిని సత్కరించి ధనసహాయము సేయవచ్చును. నిజమే ఆసంబంధమే యుక్తముగా నున్నట్టు లగుపడుచున్నది మాసుగుణమణి హృదయం బాతనియందు లగ్నమయి గాఢానురాగంబు వహించి యున్నట్టు నాకుఁ బూర్వమె పొడగట్టి యుండెను. ఆమెయూహ చెల్లించుటయు, నొకయుక్తమార్గమే(ఆలోచించుచు) ఏది చేయుటకును నాభార్యయాటంకమొకటిగలదు. ఆమెనామాటల నెంతమాత్రమీయంశములో లక్ష్యము సేయదు. అది యేమిచిత్రమోగాని కళారత్నమును జూచినతోడనే యొకవిధమయినసహజక్రోధమామె మనంబున జనించును. ఈమె కిట్టిక్రోధమున్నట్టు నేను చిరకాలమునుండియు నెఱింగియుంటినిఅతఁడిచ్చటవిద్యనభ్యసించియున్నంత కాలమున

నాతని ననేకము లయినచిక్కులు పెట్టుచునే యుండెను. ఆకష్ట జాలంబుల కన్నిటికి నోరిమి పెట్టి శాంతభావముతో విద్యనేర్చి కొని తనకాలము గడుపుకొని యిప్పుడు విశేషసుఖోపజీవుఁడయి యున్నవాఁడు. నాకుఁ గళావత్నంబునం దనురాగ మేకానికొన్ని సంగతులనుబట్టి యాతని కీయుటకు మనంబు వెరచుచుండును. మంచిది, నేనుబోయి నాభార్యతోఁగొంచెముకార్యాలోచనము చేసెదను.

[ఒకపరిచారిక ప్రవేశించుచున్నది]

చిత్ర—(పరిచారికవైపుచూచి) ఏమి?

పరి—చిత్తము. మాయమ్మగారు తమదర్శనంబునిమిత్తము వేచియుండి రని ప్రభువువారితో మనవి చేయుచున్నారు.

చిత్ర—మంచిది ఇదిగో వచ్చెదను. నీవుపొమ్ము.

పరి—చిత్తము. (నిష్క్రమించుచున్నది.)

చిత్ర—సమయమునకే వర్తమానము వచ్చినది. నేనుబోయి యీసంగతులన్నియు నామూలాగ్రంబుగ మాటాడెదను. ఆమెయు నీయంశములను మాటాడుటకే వర్తమానము పంపియుండవచ్చును. మంచిది పోయెదనుగదా! అన్నియును దెలియును. (నిష్క్రమించుచున్నాఁడు.)

కళావతిగృహము.

[కళావతి ప్రవేశించుచున్నది.]

కళావ—పరిచారిక నామనోహరుండు వచ్చునని చెప్పియున్నది. ఈసారి వివాహపుసంగతు లన్నియు మాటలాడి యేదియో నిశ్చయంబు చేసెదను. ఆలస్య మయినకొలఁది నష్టముగాని వేరొకటికాదు. పిల్లకు వివాహమునకుఁ దగినవయస్సు వచ్చియున్నది. ఇంక నాలస్యము చేయుట యుక్తముకాదు. ఆయనమానసంబు నాం

దోళనము పడుచున్నట్టు లున్నది. సుగుణమణియూహ యెట్టు లున్నను మాయిద్దఱి యుద్దేశములును సరిపడ లేదు. ఎట్టులయిన నాప్రాణనాథు నొప్పించగలను. ఏమి, యింకను రాలేదు? ఇఁకఁ గొంచెము సేపు వేచియుందును. (ఊరకొనుచున్నది.)

[చిత్రకేతు ప్రవేశించుచున్నాఁడు.]

కళావ—(ఉచితసత్కారంబులనొనర్చి) నాథా! ఈపీఠమునధిష్టింపుఁడు.

చిత్ర—(పీటమీఁదఁగూర్చుండి) ప్రియసఖి! నీ విటు కూర్చుండుము.

కళావ—(కూర్చుండుచున్నది.)

చిత్ర—నీవు నాకు వర్తమానము నంపిన పనియేమి?

కళావ—(చిఱునగవుతో) ఏమియును లేదు. మనసుగుణమణివివాహ విషయ మాలోచించునిమిత్తము వర్తమానముఁ జేసితిని. అంతియె కాని వేఱొండు లేదు.

చిత్ర—మంచిది. సుగుణమణివివాహవిషయమై యనేకాభిప్రాయంబు లున్నవి. ఇంకను నేదియును నిశ్చయింపలేదు.

కళావ—ఇటుల నాలస్యము చేసినందువలన లాభ మేమియు లేదు. త్వరలో నేదియో యొకసంబంధము నిశ్చయించి యుద్వాహము గావించుట యుత్తమమని తోఁచుచున్నది.

చిత్ర—నీవు చెప్పినమాట నిజమే. అయినను వరుం డెవ్వఁడును నేర్పడ కుండుటచే నాలస్యము నయినది కాని మఱియొకటి కాదు.

కళావ—నేను జెప్పినవరునిగుఱించి మీ రేమి యాలోచించితిరి? ఆసంబంధము మీ కంతగా రుచియుండలేదా?

చిత్ర—నీవు చెప్పినసంబంధమన్నివిధములచేతను త్తమమయినదే కాని విద్యాశూన్య మగుటచేఁ గొంచెము సంశయించుచున్నాను. నేను జెప్పిన పిల్లవానివిషయమయి నీయభిప్రాయ మేమి?

కళావ—మీరు చెప్పిన పిల్లవాఁడు గొంచెము విద్యావంతుఁడు, భోగ భాగ్యము లంతగాలేవు ఎట్టులయినను నేను జూపించిన సంబం ధముకంటె నెక్కుడయినదికాదు.

చిత్ర—పోనీ దానికేమిమనకళారత్నమువిషయమైనీయభిప్రాయమేమి?

కళావ—(కొంచెమునయిష్టమునభినయించుచునూరుకొనిచిరునగవుతో) మీకుఁ గళారత్నముమీఁద మోహము పోయినదికాదుగదా!

చిత్ర—కళారత్నమే మైయుండ సుగుణవంతుల కాతనియందు మోహ ముండ కుండ టెట్లు?

కళావ—(కొంచెము కోపము నభినయించుచు)సరే అట్లయినచో నన్ను నాలోచననడుగ నేల? మీయిచ్చవచ్చినయట్టులొనరింపవచ్చును. అటుపయిన నేమి జరుగనున్నదో చూతముగాక!

చిత్ర—ప్రియసఖ నీవీమాత్రమునకే యలిగి యున్నట్టులగుపడుచుంటివి అట్టి కోపభావంబును మానుము.

కళావ—అలిగియుండు టేమి? మీరునావచనంబులువినఁదలఁచికొనినచో నాతో మాటాడుఁడు. లేనిచో మన కిద్దఱకును స్నేహము సరి. (లేచి దూరమున నిలుచున్నది.)

చిత్ర—(తనలో) ఆహా మించినదే! (పరిహాసముగా) చెలీ! రమ్మిటు. నీవీమాత్రంబునకుఁ గోపగింపనేల? (కళావతి యచ్చట నేయు న్నది. చిత్రకేతు చేరంజని) సకియా! రమ్ము కూర్చుండుము కోప గింపక నే నడిగినప్రశ్న కుత్తర మిమ్ము! (కళావతిని గూర్చుండఁ బెట్టుచున్నాఁడు.)

కళావ—కళారత్నముమాటఁదలపెట్టినచో నాకొడలంతయునిప్పులురియు చున్నవి. నేను తెచ్చినవరునకు సుగుణమణినిచ్చి పెండ్లియొనర్పుఁడు

చిత్ర—కళారత్నమునందు నీవేమిలోపముఁ గనిపెట్టితివి, అతఁడువిద్వ త్సంపన్నుఁడు. ప్రస్తుతములో ధనవంతుఁడు కాకపోయినను

గొంచెముకాలములో ధనము విశేష మార్జింపఁగలఁడు అతని యొక్క స్థితినిబట్టి యాలోచించినచో నటులఁ బొడగట్టుచున్నది. ప్రస్తుతమం దున్నతోద్యోగమునం దున్నాఁడు అతనియందు లోపమేమియుఁ గానరాకున్నది.

కళావ—(కోపముతో) మీకుఁ గానరాకుండినఁ గానరాకపోవచ్చును. నాయింటిలో నేనాపూఁటకింతయన్నముఁ బెట్టినఁ దిని, బట్టలిచ్చిన కట్టుకొని, ద్రవ్యమిచ్చిన చదువుకొని, నావల్ల బాగుపడి తనపొట్ట పోసికొని యేలాగుననో జీవనము సేయుచున్న యాకళారత్నమున కెన్నఁడు నాకూఁతు నిచ్చెదనని తలంపకుఁడు కులంబునకు మన కంటెఁ జాలతక్కువవాఁడు. భాగ్యమునకా మనతో సరిపోల్పనే తగఁడు. మర్యాదకు మనము నిలుచున్నచోట నిలువఁదగఁడు అట్టి కులహీనునకు విద్య యున్నంతమాత్రమున నాకొమార్తె నిచ్చి లోకనిందపాలగుదునా? ఇదియేనా నాతోఁ గార్యాలోచన జేయుట కేతెంచిరి. చాలుఁజాలు.

చిత్ర—(కళావతిభుజమ్ముపై చేతినుంచి) సుందరీ! (కళావతి చేతిని దీసి వేయుచున్నది.) మనసుగుణమణి కాతనియందు విశేషానురాగ మున్నటుల తెలియవచ్చినది. కావున నన్యోన్యానురాగంబుగల యాయిరువురును బెండ్లియాడినచో శ్రేయోదాయకం బగును గదా!

కళావ—ఈయన్యోన్యానురాగంబుల కేమిగాని పిమ్మట సంభవించెడు నుపద్రవంబుల నాలోచింపుఁడు.

చిత్ర—నేమి యుపద్రవము సంభవించును?

కళావ—పిన్నయస్కురాలగుటచే లోకానుభవము లేక స్నేహంబును బట్టి యిప్పుడుగళారత్నమును గోరియున్నది. కాని, ముందునాలో చన చూచినదికాదు. అదియునుగాక శ్యామకేతుగూడనామె

యుద్దేశముతో నేకీభవించి యామెను బురికొల్పుచున్నాఁడు. పెద్దవారమై యున్నందులకు వాండ్రను మందలించి మంచిత్రోవలో దింపవలయునుగాని యూరకొనుట న్యాయముకాదు. నే నిదియే చెప్పుచున్నాను. మనసుణమణిని గళారత్నమున కిచ్చి న-చో న్యామిానియాస మిారు వదలుకొనుఁడు.

చిత్ర — నీవంతటిసాహసంబు సేయకుము. కళాత్నమున కిచ్చుటమాని వేయుదును.

కళావ — మిా మాటలు నమ్మువా రెవరు? ఇదివరలో నిట్టిపలుకులు చెప్పుచునేయున్నారు. వానిమిాఁది యాశనువిడిచియున్నవారుకారు.

చిత్ర — నిజంబుగ నమ్ము. నేను సుగుణమణిని గళారత్నంబున కీయను.

కళావ — ఏది ఈ చేతిలో చేతిని వేయుఁడు. అప్పుడుమిామాటలునమ్మెదను.

చిత్ర — (కళావతి చేతిలో తనచేతిని వేయుచున్నాఁడు.)

కళావ — (చిరునగవుతో) ఇప్పుడు నామనంబు సంతోషంబునొందినది.

చిత్ర — సంతోషమునుబొందితివా? నేనుగళారత్నంబునకిచ్చుటకుదృఢంబుగనిశ్చయించియుండలేదు. నీమానసముగనుఁగొనవలయునని యిట్లుప్రశంస చేసితినిగాని నిజంబుగ నిచ్చెదననుకొంటివా? మన శ్యామ కేతుగూడననేకపర్యాయములుగళారత్నంబునకిమ్మనిపోరి నను నాతనిమాటలు బెడచెవినిబెట్టితినిగానివినినవాఁడనుగాను.

కళావ — వానిమాయలలోఁ బడుదురనియే నేను సంశయించుచుంటిని.

చిత్ర — వానిమాయలలో నెందుచేఁ బడుదును. ఎవరిమాయలలోఁబడవలయునో వారిమాయలనే పడితిని.

కళావ — (నవ్వి) ఈప్రౌఢవాక్యంబుల కేమి మనము పోవుదము.

చిత్ర — మంచిది. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)



# సుగుణమణి.

## తృతీయాంకము.

పుష్పగిరి—కళారత్నముగృహము.

[కళారత్నము ప్రవేశించుచున్నాఁడు.]

కళా—ఉ. ఓరుపు జేసి యింతవర కుంటినిగా, యదియేమొ, నేఁడు వి
స్తారము నామనంబున విచారము పుట్టెడు, వార్తలేమియుఁ
జేరక యుంట జేసి యట శ్రీనగరంబుననుండి దాసికిఁ
గారణ మేమి నాకుఁ బొడగట్టక యున్నది యెంతచూచినన్.

ఏమి యీయాశ్చర్యము. నేను త్తరములు వ్రాయుచున్నను వారు త్తరములు వ్రాయుట మానినారు. పనితొందరవలనగానిమరి యేయితరకారణములవలనగాని నామేనమామ యుత్తరములు వ్రాయకపోవచ్చును గాని సుగుణమణిగాని శ్యామకేతుగాని సమాచారములు దెలియఁజేయ కుండుట యాశ్చర్యముగా నున్నది. ఎట్టియిబ్బందులున్నను నెన్నఁడైన నుత్తరములు వ్రాయ మానని సుగుణమణికూడఁ దనక్షేమసమాచారమును వ్రాయ కుండుట మిగుల విచారణీయమై యున్నది. (ఆలోచించుచు) కారణ మేమైయుండును.

చ. అలికులవేణి కేను దయ నంపుజవాబులు చేరియుండునా?
కలికిశరీరమందు ససుఖంబుగ నుండునో? శ్యామకేతుఁ డా
చెలియ లోనంగుజాబు లతిశీఘ్రమె నాకడ కంపుచుండునా
యలుక వహించి యుత్తరము లంపుట మేలలితాంగి మానెనా?

వీనిలో నేమైయుండును (భాగుగానాలోచించి) ఒకవేళ నాయుత్త
రము లందకుండెనా యనిన దానికిఁగారణము గానరాదు. పోనీ!
ఆమెశరీరములో సుఖముగా నుండకుండినయుత్తరము వ్రాయక
పోవుటయేమి? ఆసమాచారము ముఖ్యముగ నాకుఁ దెలియ
జేయకమానరే. శ్యామకేతుఁడామెయిచ్చెడు నుత్తరములనంప
కుండుటేమి? అదియు ననందర్భముగానేయున్నది. నాపయిసుగుణ
మణికిఁ గోపముండుటకుఁ గారణమేమియులేదు. నే నేమియుదప్పి
దము చేసియుండలేదు (మరలనాలోచించుచు)ఇవన్నియుసహే
తుకములుగాఁగాన్పింపలేదు. నే నీదినంబున వారియొక యుత్త
రము వ్రాసెదను. దానికైనఁ బ్రత్యుత్తరము రాకుండునా? ఈ
యుత్తరము కొంచెము కఠినభావముతో వ్రాసెదను. అప్పుడా
కోమలి యేమని జవాబు వ్రాయునో చూచెదను. శ్యామకేతున
కును నొకయుత్తరమంపెదను. అతఁడేమని ప్రత్యుత్తరమిచ్చునో
ఈయుత్తరమునకు మారుజాబు వ్రాయకుండెదరా? ఇఁక నప్పు
డేమి చేయవలయునో తెలియకున్నది. (సుగుణమణినుద్దేశించి)

ఉ. ఓరమణీలలామ! యిటులుత్తర మీ వొక టంప కుండుటన్
భారము జెంది నామన మపారవిచారముఁ బొంది యుండె, నిం
పారఁ బరాత్పరుండు మనయందున నిల్పిన నోలతాంగి యె
ట్లోరుపు సేయనేర్తునో వియోగము జెందనిమేషమాత్రముం గా.

(ఇటునటు జూచుచు) ఎవరో వచ్చుచున్నటు లగుపడుచున్నది.

[చంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కళా—మిత్రమా! మీరిచ్చటి కెప్పుడేగుదెంచిరి?

చంద్ర—నిన్నటిదినంబున నే వచ్చి మిమ్ములఁ గనుఁగొనఁ బ్రయత్నించు
చుంటిని నేఁడీమధ్య శ్రీనగరంబు పోయి యచ్చటఁ గొన్ని కార్య

ములునిర్వర్తించుకొని యింటికిఁ బోవుచు మిమ్ములఁ గలసికొని మాటాడి పోవలయు నని వచ్చితిని.

కళా—(ఆతురతతో) మీరు శ్రీనగరంబునుండి యేతెంచితిరా?

ఉ. సేమమె చిత్రకేతుఁడు, విశేషసుఖంబె తదీయభార్యకున్
సేమమె యాత్మజుండు పరిశీలనశాలి, మనోహరాంగి క
న్యామణి, న్యాయశీల, సుగుణాంబుల ప్రోవు, తదీయపుత్రియున్
సేమమె మిత్రశేఖర! వచింపుఁడు నాకొకయుత్తరంబులోన్.

చంద్ర—ఆహా! వారంఱును క్షేమముగానే యుండియున్నారు. నేను చిత్రకేతు, శ్యామకేతులను స్వయముగఁ గలసికొని మాటాడి నాను మీ రెంతమాత్రమును వారివిషయమై యలజడి పొందవలదు, అదియునుగాక మీరంతగా నాతురతతో వారి క్షేమ లాభంబు లరయుట కంతె యవసర ముండునట్లు లగుపడదు.

కళా—ఏమి మిత్రమా! మీరట్లనుచుంటిరి? చిన్ననాటనుండియు నన్నుఁ బెంచి విద్యాబుద్ధులు చెప్పించి తల్లిదండ్రులవలెఁ గాపాడినవారి క్షేమంబుఁ గనుఁగొన కుండుట యనుచితంబుగాదా?

చంద్ర—మీ కట్టివిశ్వాసముండుట న్యాయమే అయినను ప్రస్తుతాంశములనుబట్టి చూడ వారంతగా మీయందుఁ బ్రీమాతిశేకంబున నున్నట్టు లగుపడదు.

కళా—చిత్రకేతునకుఁ నాయందు విశేష ప్రేమయే. శ్యామకేతునకత్యంత స్నేహభావము. సుగుణమణి యనురాగంబు వచనాతీతమే. చిత్రకేతునిభార్య యొకతెయె కొంచెము పరాఙ్ముఖభావంబు వహించియున్నది.

చంద్ర—ఆమె పరాఙ్ముఖభావమే యింతవరకుఁ దెచ్చినది.

కళా—ఏమిట్రిది? ఎంతవరకుఁ దెచ్చినది?

చంద్ర—ఇంకను మీ రెఱింగియుండ లేదా? సుగుణమణినిమీకుఁగాక

మరియొకరికి వివాహంబుసేయ నిశ్చయించుకొనియున్నారు. ఇంతకును గారణ మాచిత్రకేతుని భార్యయే.

కళా—(అత్యాతురతతోఁ దడఁబడుచు) ఏ... ఏమిటి, సుగుణమణిని సుగుణమణినిమరియొకరికీయనిశ్చఇంచుకొంటిరా? నిశ్చయించుకుంటిరా? నిజముగా నిశ్చయించుకుంటిరా? ఏమి ఈయాశ్చర్యము! నేనెన్నఁడును నిట్టిసంగతిని తలంచుకొనియుండలేదే.

ఉ. మీవచనంబు లింకఁ బ్రియమిత్రమ! నిశ్చయమంచు నెంతునా!

చంద్ర—నిశ్చయముగా నెంచుఁడు.

కళా—యావిమలోజ్వలాంగి నహహా యితరుండు పరిగ్రహించునా?

చంద్ర—నిజమే పరిగ్రహించును.

కళా—యీవిధ మాచరించుట సహేతుక మంచు మదిం దలంచిరా?

చంద్ర—ఆహా సహేతుకమనియే తలంచియుండిరి.

కళా—భావములోన మీర లొకమారు తలంచి నిజంబుఁ జెప్పుఁడా.

చంద్ర—ఏమి మీరట్లు సందేహించుచుంటిరి. నేనుజెప్పునది యసత్యమనియేనా మీయుద్దేశము. మీ కసత్యము విన్నవించినచో నాకేమి లాభంబు సంభవించును.

కళా—ఏమి యీయాశ్చర్యము. ఇట్టివింతలు సంభవించునని యెన్నఁడును దలంచి యుండలేదు. ఆహా! దైవకృప యెట్లున్నదో!

(ఆలోచించుచున్నట్టు లభినయించుచున్నాఁడు.)

చంద్ర—మీరట్లు దీర్ఘాలోచన పరులయినగార్యమేమి? మీయూహ సఫలీకృతము గాకపోయెనుగదా! మీరావిషయంబున విశేష చింతాపరులుగావలదు. నేనుతమతో నొక్కవిషయమై ముచ్చటింప నేతెంచితిని. మీరు సావధానచిత్తులయివినుండుచెప్పెద.

కళా—మీరేకార్యమునిమిత్తమే తెంచితిరి. అతిత్వరితముగ సెలవిండు

చంద్ర—మీరుసుగుణమణిని బరిగ్రహించుటనిస్పృహమైనది. కావున

కళా—నిస్పృహాయేనా?

చంద్ర—ఇంకనుసందియమేమి? మాపినతండ్రిగారికొమార్తె యందగత్తె స్వల్పవిద్యాపరిచితురాలు సుగుణవతి యొక తెగలదు. ఆమెను మీరు పరిగ్రహింపవలయునని ప్రార్థించుచున్నాఁడ. మాపిన తండ్రిగారు గూడ తమవిన్నపముగ మనవిచేయమనిరి.

కళా—(పరితాపము నభినయించుచు) సుగుణమణి దివ్యనామాక్షరంబుల ముందర యింకొక పేరుఁ జలకట్టిన నాకది వినిపించదు.

చంద్ర—తమరట్లసహ్యాభావమును గనుపరుపవలదు. ఈమెయుఁగూడ నన్నివిషయములలో సుగుణమణికి సమానురాలే?

కళా—సమానురాలయినను సరే యధికురాలయినను సరేనా మనంబు మాత్రము మఱియొక కన్యామణియందు నిలుపదు.

ఉ. ఏటికి నట్టిమాట? తగ దీపని నాహృదయంబు నాలనా
నాటికి వృద్ధిబొందుచుఁ జెనంగొని యాలలితాంగి మీఁదనే
నాటెను గాన బోటుల మనంబున నింకొకరిన్ వరింప, ము
మ్మాటికిఁ జెప్పుచుంటి ననుమానము లేదు, నిజంబునమ్ముఁడీ!

చంద్ర—ఏమి! పిన్నవయస్కులగుటచే నట్టుల వచించుచుంటిరిగాని కొంచె మాలోచించిన నిట్టిమాటలు పల్కరు. సుగుణమణికిని మాచెల్లెలకును దారతమ్య మంతగాలేదు. కొన్నియంశము లలో మాపిల్లయే యధికురాలు.

కళా—మీమాటలు నాకెంతమాత్రమును రుచింపవు. చిన్ననాటి నుండియును నాహృదయంబాసుగుణమణిమీఁద గట్టిగ నాటి యుండుటఁ జేసి యిప్పుడు మరల్పజాలను. నన్ను మీరీవిషయం బులో శ్రమ నొందించవలదు.

చంద్ర—మీరట్లు దృఢముగాఁ జెప్పుచున్నపుడు నేనేమివక్కాణింపఁ గలను. ఇఁక నేను సెలవు దీసికొందును.

కళా—చిత్తము. (చంద్రసేనుడు నిష్క్రమించుచున్నాడు.) ఆహా! యెంతకష్టము సంభవించెను, నన్నే కాని యింకొకనిని పెండ్లి యాడనని దృఢనిశ్చయరాలైయున్న నాసుగుణమణి యెట్టు లీకార్యంబున కుద్యమించెనో.

మ. అకటా! యేమితలంచువాడ గరంమన్యాయంబు ప్రాప్తించె, నింతికిదూరం బగుచున్ భరింపగలనా దేహంబునన్ ప్రాణముల్

(సుగుణామణి నుద్దేశించి)

సకియా! ముద్దులగుమ్మ భోగవతి నాసౌభాగ్యమా! యెట్టు లీ
వికనాభర్తను బొంది సంతతము సంతృప్తిన్వినోదింతువే.

ఇంత కొద్దికాలములో నిట్లు మారిపోవుటకుం గారణమేమి? (ఆలోచించుచు) ఇదియంతయుం గళావతి చేసినదిగాని మరియొకటి కాదని నేను నమ్మెదను. ఆమెకు నాయం దయిష్ట ముండుట సుప్రసిద్ధము. కావున నీయంశములో నామెయాటంకమే కాని మరియొకటికాదు, (మరలనాలోచించుచు) ఈతడు చెప్పిన మాటలు నమ్మనగునా? ఈతం డిట్టిమాట పుట్టించి నామనంబు వ్యాకులపెట్టిన నేమికార్యము? నాకేమినిశ్చయించుకొనుటకును దెలియకున్నది మంచిది.

ఉ. ఈవచనంబులందు నిజ మేమయినం గలదా? యితండు సం
భావితమూర్తి చూడంగ నబద్ధము లాడునె? వేగిరింప కే
నీవిషయంబునందు నొకయించుక తాలిమి జేయ శ్రేష్ఠమౌం
గావున దీనిసత్యమునకై యొకకొంచెము వేచియుండెదన్.

(నిష్క్రమించుచున్నాడు.)

శ్రీనగరము—చిత్రకేతునిగృహము.

[చిత్రకేతుడు, శ్యామకేతుడు, కళావతి సుగుణమణి ప్రవేశించుచున్నారు]

చిత్ర—సుగుణమణీ! ఇటురమ్ము!

ప్ర.—తనయా! యిన్నిదినంబు లిట్లరిగె సుద్వాహోత్సవింగానమిక మనపుణ్యంబున సుందరాంగుఁ డొకసన్మాన్యుండు ప్రాప్తించె,నా తని సుద్వాహము నీకుఁ జేయ మని సుత్సాహంబు బుట్టెఁ, విలం బన మీపట్లను జేయుఁగావలదు ప్రేమఁ జెప్పుమా నీవుదిక.

సుగు —(ఊరకున్నది.)

కళావ —అమ్మా! మీతండ్రిగారి ప్రశ్న కుత్తరము జెప్పుము.

చిత్ర—నీవు భయపడనేల! ఇచ్చట నున్న వారందఱును మనవారలే నీ వనుమానింపక నీయూహఁ జెప్పుము.

శ్యామ—అనుమానింపనేల చెల్లెలా?

సుగు—మ. అనుమానింపక మీ కొనర్తు నొకదివ్యంబైన విజ్ఞాపనం బు, నను నామది నిల్చి కట్టికరుణాంభోరాసికిఁ బెండ్లిసే సి,నయంబారసుఖాబ్ధిఁ దేల్చుఁడికఁనా చేతోంబుజాతంబుమిం చినపంతోషముబొందు,నియ్యదియె నేచెప్పన్విలోకించితిక.

చిత్ర — నీమనంబులోని ప్రియుం డెవండు?

కళావ—కళారత్నముదప్ప మరియెవ్వరు?

చిత్ర — అతఁడేనా నీమనంబున నిల్చియున్న ప్రియుండు.

సుగు—)కొంచెముసిగ్గు నభినయించుచున్నది.

శ్యామ—అతఁడే, ఇది యందరెఱిఁగినదే. దీని కింత శంకయేల?

కళావ—అమ్మా! సుగుణమణీ! మేము సంపాదించిన వరునకును గళా రత్నంబునకును విశేషతారతమ్యము కలదు.

చిత్ర —అవును మీయమ్మ వచించిన వాక్యము నిజము. అతనికినీతనికిని విశేషభేదంబు గలదు. ఈవరుం డెవరో నీకుఁ దెలియునా?

కళావ—తెలియును నేను జెప్పియుంటిని

చిత్ర—ఇద్దఱితారతమ్యంబులు నీవే గ్రహింపఁగలవు. వినుము.

మ. చారుసువర్ణమూర్తి, బలశాలి మహాధనశాలి, సంతతో
దారుఁడునైన నొక్కని ముదంబునఁ బెండిలియాడ కింక సా
ధారణ విద్య నేర్చె వని తద్దయుఁ, గోరి వరించు టేల? బం
గారపుగత్తి యున్నదని కాంతరో! కుత్తుకఁ గోసికొందురే.

సుగు—ఉ. చారుసువర్ణమూర్తి బలశాలి, మహాధనశాలి, సంతతో
దారుఁడునైన నేమి? పరతత్వవిచారుఁడు నీతిశాస్త్రవి
స్తారుఁడుబుద్ధిమంతుఁడుప్రశాంతుఁడుదాంతుఁడుగాకయున్నమం
దారము జూతురే కడు ఘనం బగునట్టిగులాబిముందరన్.

కళావ—చాలు,నీవిద్యాప్రవీణ్యమంతయునిచ్చట నేచూపించవలయునా?

శ్యామ—అమ్మా నీవు శాంతింపుము.

చిత్ర—సుగుణమణీ నీవు చిన్నదానవు మేము చెప్పినట్లు విని నడచు
కొనుము. మమ్ముల నగౌరవపరపకుము.

మ. వినుమా ముద్దులబిడ్డ! నీ విటుల నిర్భీతిన్ వచింపంగ నే
మని జెప్పంగలవారమమ్మ మఱి నీ వత్యంత మౌర్ఖ్యంబు జే
సిన నీమానస మింకఁ ద్రిప్ప వశమే చెల్వొండ నిన్బెంచి వి
ద్యను జెప్పించినదాని కీఫలము లాహా! చూడ యత్నించితే.

సుగు—ఉ. సర్వసుఖంబుల న్బెనుపఁ జాలినదానికి నేకృతజ్ఞతా
పూర్వకవందనంబులఁ బ్రిపూతమనంబున నాచరింతు నీ
యుర్వి సమస్తసౌఖ్యముల నొందఁగ వానివరించి యున్న న
న్నోర్వఁగలేక మీరు కఠినోక్తుల నిట్లు వచింప న్యాయమే?

కళావ—ఇందులోఁ గఠినవచనంబు లేమి గలవు. నీ కయిష్టములయిన
వాక్యము లన్నియు నీకుఁ గఠినముగానేయుండును. అందులకు
మే మేమి చేయుదుము.

చిత్ర—(కళావతివైపుతిరిగి) నీవు తొందరఁ జెందకుము. ఆమెవచించు
పలుకులన్నిటికిఁ గోపమువహింపకుము. ఆపలుకులన్నియువిన్న,

కళావ—మీకుఁ గూడ నాసుగుణమణియందే పక్షము.

శ్యామ—అమ్మా! న్యాయ మెటులుండిన నట్లు తిరగవలయునుగదా.

చిత్రి—(సుగుణమణిని జూచి)

మ. అతిసౌందర్యవిలాసవైభవము, శౌర్యాటోపగాంభీర్యము
న్నత సౌభాగ్యపదంబు బో విడచి నెంటన్ నీదుడెందంబు
శ్రుతవిద్యాగరిమంబు గోరెఁ దరుణీ చూడంగ నాశ్చర్యమి
గతి నీ కెవ్వరు బోధ సేసి రివి యగ్రాహ్యంబు భావింపఁగన్

సుగు—చ. ఎవరును బోధ సేసి వచియించినసంగతి గాదు నాకలో
చెవినయ మొప్ప నామది వశీకృత మాయె సువిద్యచేత రూ
పవిభవశౌర్యముల్విడచె, బాగుగ వెన్నెలగాయఁ జందురుం
డివి బరికింతురీ గాని తమిదీరఁగఁ జుక్కల నింకఁ జూతురే!

శ్యామ – (చిరునగవు గనపరచుచున్నాఁడు.)

చిత్రి—సుగుణమణీ! నీవు విశేషవిద్యావంతురాలవని యెఱుంగుదుము.

కళావ—ఆవిద్యయే యిప్పుడు ప్రాణాంతకమయియున్నది.

సుగు—అమ్మా నీ వంతగా విసవనేల?

చిత్ర—మేము సంపాదించిన వరుడును గళారత్నమునకును నేయం
ములో దారతమ్యము గలదో కని పెట్టితివా? నీసౌఖ్యమును
యాలోచించి యిట్టిభాగ్యవంతునిఁ దెచ్చి నీకువివాహము సేయ
నిశ్చయించుకొంటిమి.

చ. గురుతరభోగభాగ్యములు కొంకక వెలిద్రోయు పడరానిపాట్లు ని
ష్ఠురగతిఁ బొందుచుండి, పటుశోకములోన మునింగి జేటరి
స్తరము సుఖంబు లొందెది ప్రమదంబున నందునిమిత్తమిప్పు
త్వరముగ మానసంబు నెడబాపుము నీప్రియునుండియిత్తరి

సుగు—చ. ఘనతరభోగభాగ్యములఁ గాంచునిమిత్తము నాథునంబర
గను వరియించినాప్రియుఁ నఖండకళానిధిఁ బాయు టెట్లు? త

వినిగుసుమంబునుండి మరి వేరొనరింపఁ దరంబె యుంచుకె
నను దలపోసిచూడక మనంబున నిట్లు వచింప న్యాయమే?

కళావ—మనంబున విశేషముగ నాలోచించి చేసినపనియే యిది.

శ్యామ—అటులొనరించినకార్యమని నాకుఁ దోఁచదు. మీరుబాగుగ
నాలోచించినచో సుగుణమణి యుద్దేశమునే నెరవేర్తురు.

చిత్ర—శ్యామకేతు! నీకంటెఁదెలివితక్కువవారమనియూహించితివా?
లేనిపోని యిట్టి యసందర్భప్రసంగములఁ జేయకుము.

కళావ—శ్యామకేతువలననే సుగుణమణియుఁ జెడిపోవుటకుఁ గారణం
బయ్యె.

సుగు—అమ్మా! ఇట్టినిరాపనిందనాతనిమీఁద నెందుచే మోపెదరు?
ఏదియైనను నన్నునుఁడు. కానినిష్కారణమాతనినిందింపకుఁడు.

చిత్ర—మీరిద్దఱును నొక్కటియే. అదేమిచిత్రమోగానిమీకిద్దఱకొక
విధమయిన యనురాగ మాకళారత్నమునందుఁ గలిగియున్నది.
అతఁడే విషయంబులో మనకు సరిపోల్పఁదగఁడు. మీకట్టిప్రేమ
యాతనియం దుండుటకుఁ గారణమేమియుఁ దోఁచకున్నది. కుల
శీలధనౌదార్యములయందు నాకళారత్నము మనకంటెఁ జాల
తక్కువవాఁడు.

ఉ. ఓరమణీమణీ! విను మహోన్నతసత్కులజాతుఁ డీమహా
ధీరుఁడు వీనిమాని యొకదీనకులోద్భవుఁ జెట్టఁబట్టి శృం
గార మెలర్ప సౌఖ్యములఁ గాంచెద నంచు వచించె దీవు ని
ష్కారణ మెందుచేత మనగౌరవ మిట్లు తృణీకరించెదే.

సుగు—ఉ. ఆరయ గౌరవంబు లవమైనను బోదు ప్రసిద్ధవంశ వి
స్తారుఁడుగాక యుండినను దక్కువయానె సువిద్యయుండఁగా
ఘోరజలంబులోన నొడికంబుగ బుట్టునటంచు ముత్యమున్
గోరక యూరకుందురె జనుల్ మఱిఁదాల్తురుగానికూరిమిన్.

చిత్ర—(తనలో) ఆహా! మించుచున్నదే. (ప్రకాశముగ) సుగుణమణీ నీవు క్రమక్రమంబు నీప్రసంగము నెచ్చించుచుంటివిగాని తగ్గించు చున్నటు లగుపడదు.

సుగు—మీరట్లు దలంచుచుంటిరి కాని నే వచియించు పల్కులలో నిజం బారయుచున్నవారుగారు మీకునుమాయమ్మకును, నీవిష యంబున నాయందుఁ గోపభావ మున్నట్టు తోఁచుచున్నది.

కళావ—మేము చెప్పినచొప్పున వినకుండినయెడలఁగోపభావముండదా!

శ్యామ—మీరు చెప్పినట్లువిన కేమి? అందులో న్యాయముండినయెడల ఆమెమానసం బాకళారత్నముమీఁదలగ్నమయియున్నదనియు నాతనిఁదక్క వేరొక్కని వివాహము జేసికొననని యుఁజెప్పుచుండి నపుడు మీరేల యీమెమాటల విశ్వసింపరాదు?

చిత్ర—నీ వూరకొనుము. విశేషజ్ఞానవంతుఁడవని నే నెఱుంగుదు, సుగుణమణీ!

ఉ. మావచనంబుల న్విని క్రమంబుగ, మే మొనరించువ్వాని నం
భావన జేసి శీఘ్రమె వివాహము జేసుక, సౌఖ్యవార్ధి నెం
తో విలసిల్లుచుండఁ బరితోషముతో నినుఁ జూడఁ గోరి మా
భావము లింక బొంగెడు నభంగతరంగపరంపరాకృతిన్.

సుగు—ఉ. నామన మింక నాతనిమనంబున నైక్యము జెందకుండినన్
బ్రేమ దలిర్ప వానిని వరించి కరంబు, వివాహమాడి యు
ద్దామసుఖాబ్ధి మిమ్ముల ముదంబునఁ దేల్చుటలెట్లు పుష్పముల్
దామముగాఁగఁ గూర్చినఁగదా ప్రమదం బొనరించుగండ్లకున్.

చిత్ర—ఏమిటిది? నీవుచెప్పిన కొలఁది పెచ్చు పెరుగుచున్నదానవు.

కళావ—ఇది యంతయు విద్యాప్రావీణ్యము వలన సంభవించినదే. ఈయుపరసరస్వతికిని యీయపర బ్రహ్మయైనఁ గళారత్నమునకు నిందుచేతనే యన్యోన్యానురాగ మంకురించి వృద్ధిపొందినది,

శ్యామ—సమానమనోవిలాసము గలవారికిఁదప్ప నితరులకు సాంగత్య మెట్లుగలుగును?

చిత్ర – చాలుఁజాలు మీతార్కికవాదంబులు,

శ్యామ—మీరట్లసహ్య భావంబును గనుపరుపకుఁడు సత్య మారసి మాటలాడుఁడు,

సుగు—అన్నయ్యా! నీవూరకొనుము నానిమిత్తము నీవెందుచే నిష్ఠురోక్తులపాలగుదువు.

చిత్ర—(తనలో ఇంతవరకును జూచితిని ఏమియు మనంబు దిరిగినట్టులు కనుపించలేదు. ఇంకొకకారణము చెప్పెదను దీని కేమనునో చూచెద (ప్రకాశముగా)

ఉ. నీపలు కాలకించి తరుణీమణి! నీమదిఁ గోరినట్టి వి
ద్యాపరతంత్రు కిచ్చిన నతండు విదేశనివాసుఁ డౌట నిఁకఁ
జూపఁడు సారెసారెకు మనోభ్రమ దీరఁగ నంత నీకునుఁ
మాపయిఁ గూర్మి తగ్గు ననుమానము లేదు నిజంబు పల్కితిఁ.

సుగు—చ. హరహర! యెంతమాట యిటులాడుదురే ననుబెద్దజేసి వి
స్తరముగ విద్యనేర్పి సతతంబును గాచుచునున్న మీపయిఁ
మురిపెము తగ్గునే? యగరుపుల్లను దూరమునందు నుంచినఁ
బరిమళ మేర్పడంగఁ గడుబంధుర మయ్యెడుగాని తగ్గునే?

శ్యామ—(నవ్వుచున్నాఁడు.)

చిత్ర—[ఆశ్చర్యభావము నభినయించుచుఁ దనలో] ఏమియు క్తిప్రయుక్తు లధికములగుచున్నవి. [ప్రకాశముగా] సుగుణమణీ! నిన్ను జూచిన నాకు గోపమెక్కువగుచున్నది. నిష్కారణముగ నాకో పానలంబున కగ్గలంబుగాకుము, నేను చెప్పినచొప్పున విను.

ఉ. నాపలు కాలకింపక యనాదరణం బొనరించి తేని ని
క్షేపము లైనసౌఖ్యములఁ జెందక బాధలఁ బొందెదీవు, శ్యా

సీ! పగవారిమాటవలె నీ కిపు డేమి రుచింపకుండు సం
తాపము బొందినప్పుడుయదార్థముబోధపడున్ గ్రహంబునన్,
సుగు—ఉ. మిమ్మునతిక్రమించియిటులమీఁదటనా ప్రియుబెండ్లియాడదుః
ఖమ్ములు సంభవించు ననిగాఁ దమరంటిరి మానసంబు లే
కమ్ములు గానిచో మిగులఁగష్టములౌను సుఖంబులెల్ల భా
వమ్ములు నొక్కటైనతరి బాధలెసౌఖ్యములై కనంబడున్.
స్యామ — వింటిరా యామెపల్కు, అందులో నెంత సత్యమున్నదో
గ్రహించితిరా?
కళావ—అవియన్నియు మీకే తెలియునుగాని మా కెంతమాత్రం
బును బోధపడవు.
చిత్ర—శ్యామకేతు! నిన్నెన్నివిధంబులు మంగలించినను నూరకొన
వేమి సుగుణమణీ ఇంతవరకును జెప్పవలసినరీతిని జెప్పియుంటిమి
నీవికమీఁద నేమి సంభవించునో యాలోచించుకొని ముందు
ప్రయత్నములయం దుండుము. ఇట్టి వృథావచనంబుల వలన
నేమియుఁ గార్యము లేదు. నీ వెంత చెప్పినను వినకున్న దానవు.
కళావ—ఎందుకు వినును.
చిత్ర—మ. పలుమారిట్టుల బోధచేసినను నీపంతంబె నెగ్గింప నూ
హలు జూపించుచు నున్న దానవుగదా యయ్యోయి కేమందు నీ
వల వానిన్ వరియించి యెంతయు వివాహంబాడి కష్టంబులన్
బడగానేల తలంచిచూడ నది భామా స్వర్గమా మోక్షమా?
సుగు—చ. మన సెవనిన్ వరించి కడుమైత్రి వహించునొ వానినుండి వ
చ్చిన బలుబాములే వినుఁడు చెప్పెదస్వర్గమె మోక్షమే సుఁడీ
యినకిరణంబు లెంతయు సహింపని వేడిమిఁ గల్గియున్నవై
నను సతతంబు బంకజగణంబులు వానినె కోరుచుండవే.

శ్యామ — [చిరునగవు జూపుచున్నాఁడు.]

కళావ — [భర్తవైపు తిరిగి] ఇఁకఁ గార్యము మించినది. మీ బోధనలవలన నేమియుఁ గార్యము లేదు. నేనీమాట మొదటనే చెప్పియుంటిని. వివాహకార్యంబులలో మనయిష్టము వచ్చినట్లు జేయవలయును గాని వధూవరులయిష్టము ప్రకారము నడచెదమన్న తుదనెగ్గునా

చిత్ర — (భార్యతో) ఇఁక నేమి చేయవలయును.

కళావ — అది మీ రెఱుంగరా?

చిత్ర — (కన్నులెఱ్ఱ జేసి)

ఉ. నీసరివారు పెద్దల గణించి చరింపఁగ నీవు నింత వ్యా
త్యాసపుమాట లేల యిఁకనైన వివేచనబుద్ధి లేదె యా
రా సుఖయించుదానవటె యాపరదేశినిఁ గూడి, మంచి దిం
కేసిగుణంబ మొన్న జనియించిన పిల్లవు నీవు దుర్మతీ!

(కోపముతో) సుగుణమణీ! నీవు మమ్ముల వృథా ప్రయాసము బెట్టుచుంటివి. ఇంతవఱకు కోరుపు జేసితిని గాని యిఁక నోర్చుట గష్టము. నీయిష్ట ప్రకారము చేయుట గలనైనఁ దటస్థించదని దృఢముగా నమ్ముము.

సుగు — అటులయిన నాత్రోవ నేను జూచుకొందును. మీ రెంత చెప్పినను నామాటలు వినినవారు కారు.

చిత్ర — (కన్నులెఱ్ఱజేసి) ఏమి! నీమాటలు మేము వినవలయునుగా.

ఉ. ఓసి దురాత్మురాల విననొల్లక మావచనంబు లింత యా
యాసముఁ బెట్టెదేల లవమైనను నీ కిఁక బుద్ధిలేదె, కా
నీ సుఖయింతుగాని మరి నీవు వరించినవానిఁ గూడి నా
మీసము గాదుసుమ్మిది నిమేషములో నిను నొంపకుండినన్.

సుగు — చ. అలఘుతరప్రభావ సుగుణావన! కారుణికాగ్రగణ్య యి
ట్టులఁ బరుషోక్తు లాడుచుఁ గఠోరతరంబుగఁ గోపగించి న

న్నలమటఁ బెట్టనేల? యెటులైననునా మొరలాలకించి యీ
పలుకుల న్యాయమారసి కృపామతి న న్దరి జేర్పఁగ వెసన్.

చిత్ర—(కోపోద్రేకముతో) మంచిది మంచిది. దరిజేర్చెదను. నీవు మామాటలనింతయలక్ష్యపెట్టితివిగదా. ఛీ! పరమదౌర్భాగ్యురాల! ఇఁక నీమొగంబు జూడకూడదు. నాయెదుటనుండి లేచి పొమ్ముపొమ్ము నీవిచటనిలువవలదు (లేచితన్నబోవుచున్నాఁడు)

సుగ—(విచారముతో) హా! కళారత్నమ! కళారత్నమా!

[నిష్క్రమించుచున్నది.]

చిత్ర—శ్యామకేతు! నీవువిశేషంబుగ నీవిషయంబులో సుగుణమణికి సహకారివై యుంటివి నిన్నునుశిక్షింపవలయును. పెద్దవాఁడవని యూఱకుంటిని. (భార్యవైపుతిరిగి) సఖి సుగుణమణి నిష్టబడుప వలయుననియెన్ని యేనిప్రయత్నములను జేసితినిగానియవన్నియు వృథయయ్యె. వానితో మని కేమియుఁబనిలేదు. మనముసంపాదించినవరునకిచ్చి పెండ్లిచేయుట నిశ్చయము. కావున వివాహసన్నాహంబు లాచరింపుము. శ్యామకేతు! నీవును వివాహప్రయత్నములయందు శ్రద్ధవహించి కార్యమును నెరవేర్పుము. ఇఁకముందు ప్రయత్నములఁ జేయుదము. రండు పోదము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

పుష్పగిరి—కళారత్నము గృహము.

(ఒకకాగితముతోఁ గళారత్నము ప్రవేశించుచున్నాఁడు.)

కళా—(అత్యంత పరితాపముతో) పోవుదునా? మానుదునా? ఏమి చేయుదును? ఎంతవరకు సంభవించినది. ఆహా చంద్రసేనుని వచనంబు లన్నియు నిజంబులాయెనే అయ్యో!

ఉ. నవ్వులకైనఁ జూప దొకనాఁడు పరాఙ్ముఖభావ మట్టి యా
జవ్వని స్నేహ మిప్పుడు విషం బయి పోయెనె యేమిసేతు నిం

కెవ్వారిపజ్జ జేరుదు మఱెవ్వరు నా కిఁకఁ బ్రాణమిత్రు లిం
కెవ్విధిఁ గాంతు నావలపుటింతి నయో తమిదీర దైవమా!

(భూమిపై వ్రాలుచున్నాఁడు.)

(లేచి) అయ్యయ్యో! నాప్రియసఖీ! నాసేమపుంజమా! నామనో హారిణీ! నాకోరికలప్రోవా! నాబహిఃప్రాణమా! నానుగుణమణీ! ఎంతస్వల్పకాలములో నాదృష్టికిఁదూరంబయితివే. కన్నెలమిన్న నప్పంబునం దయిన మనకు నెడబాపు గలుగునని తలంచి యుండలేదుగదా. ఓసుందరాంగీ నీవు పరాధీనురాలవైతివా! ఆమాటదలంచికొనినమాత్రంబున శరీరంబుగ పించి ముచ్చెమటలు బోయుచున్నది. ఏమి! సుగుణమణిని మఱియొకఁడువివాహమాడునా? నిజమేనా? ఈమాటలయం దేమయిన సత్యమున్నదా? సుగుణమణి నాసొమ్ము కాదా? (తనచేతిలోని కాగితమువంక జూచి) అయ్యో! ఏమి! ఇంత జ్ఞానహీనుఁడనైతిని. ఆమెయే స్వయముగ నీయుత్తరము పంపియుండఁగ నేను బొరపాటు పడుచుంటినేమి! (ఉత్తరమును ముద్దుపెట్టుకొని) సుగుణమణీ స్వహస్తలిఖితపత్త్రిక! ఆలలితాంగి నాకండ్లఁ బడకున్నను నామె దివ్యహస్తములతో లిఖించిన యక్షరజాలంబు గలిగియున్న నీవైనను గండ్లఁబడి నామనోతాపంబు జల్లార్చితివిగాని మఱియొక విధంబుచే నాతాపంబు నుద్రేకింపజేసితివి గదా. అయినను నేను జేయవలసిన దేమియున్నది. ఓయుత్తరమా! నిన్ను జూచినమాత్రంబునఁ గన్నీరు మున్నీరై పాఱుచున్నది. అయ్యో! ఓకన్యారత్నమా! ఓసుగుణమణీ! నీవీయుత్తరమెందుకు వ్రాసితివి. వ్రాసితిపో హృదయశల్యంబులైననాపూర్వపుసంగతులెందుకు వక్కాణించితివి. ఒక్కొక్కసంగతిఁ దలంచి చదివినమాత్రంబున నొక్కొక్కప్రాణము పయి కెగరిపోవుచున్నది.

అయినను ప్రాణములు పోయినవికావు. ఎన్నిమాఱులుజదివిన
పోవునో ఇంకొకసారిజదివెదను. (ఉత్తరమునుదీయుచు గన్నీరు
విడుచుచున్నాఁడు) చదువుదునా? (చదువుచున్నాఁడు.)

"ఉ. జ్ఞానమనోజ్ఞమూర్తి గుణజాల విభూషణతేజ నాఁబహిః

[కన్నీరు విడుచుచున్నాఁడు.]

ప్రాణమ! మీకు వందనపరంపర లెంతయు నాచరించి స
న్మానముతోడ వ్రాసెద ఘనం బగుజ్జింత నొకంచు జాబు గ
ళ్యాణ మొసంగుగాత నకలంకకృపానిధి మీకు నెప్పుడున్"

అయ్యో! ముద్దుకోమలి కళ్యాణము సంభవించునంతటి యదృష్టవం
తుఁడ నైతినేని నిన్నే పెండ్లియాడుదును. ఈపరమదౌర్భాగ్య
నకు నీవేలలభింతువు. [మరల నుత్తరమునుజదువుచున్నాఁడు.]

"మ. అతిసమ్మోదముతోడ నిద్దఱము విద్యాశాలకుం బోయి సం
తతమున్బాఠము లప్పగించి యొకనైనం దప్పు లేకుండ"

అయ్యో! నాయొడలు నీరగుచున్నది. "స
న్నుతులంజాలగ సంది కాలమునుసంతోషంబునన్ బుచ్చు సం
గతి నెంతో తలపంగ మానసము వేగన్ జింతచేఁగుందెడిన్"

అందులకు సందియమేమి. ఆహా! [నిట్టూర్పువుచ్చుచు మరలఁ
జదువుచున్నాఁడు.]

సీ. "చిఱుతప్రాయమునాఁడు చెలగుచు మనమొక్క
దినమందు మృదుపుష్పవనములోన
సుమజాలములఁ గోయుచును జాలసంతోష
మైనట్టి మాటల నాడికొనుచుఁ
గాలంబుఁ బ్రీతితో నడపుచునున్నంత
మీ రొక్క వృక్షంబు జేరి డాగి

నన్ను మోసము చేసినారు ["జ్ఞానహీనుఁడనుగనుక"] నేనంతట
మిగుల మానసమందు బొగులుచుండి

తే. గీ. మిమ్ము వెదకుచునుండ పాదమ్ములోన
ముల్లు విరిగెను నాకు నే నుండు కొక్క-
యడుగునైనను బెట్టలేనైతి నప్పు
డంత మీరొందిన వనట కలవి కలదె.

[ఆకసమువంక జూచుచు నిలబడియున్నాఁడు.] (చదువుచు)

సీ. డాయంగ మీరున్నఁ బోయి యావల వారి
ముట్టెడు దాగుడుమూతలాట!
["ఆహా"] తడవైనచో మీకు బడలిక వాపంగ
పడిదొంగనైన స్తంభంబులాట [విశ్చేష్టుఁడై నిలుచున్నాఁడు.]
మీమీఁద కేఁక వచ్చునేమో యని తలంచి
యటునిటు నూదు పచ్చాకులాట! [అయ్యయో]
పరులకు లేకుండఁ బొరిగొని మీపైనె
బలిమిమై విసరెడు బంతులాట!

తే. గీ. వీని దలఁపంగ గటగటా మేను వడఁకు
వరదలై పారుగన్నుల బాష్పజలము
లట్టి సౌఖ్యంబు గడతేరి యిట్టివంత
సంభవించెను మన కింక సదయహృదయ.

అన్నన్నా! ఎంతటికష్టంబు ప్రాప్తించెను. [మరల జదువుచు]

చ. "ఫలితముగాక యుండఁ బ్రనవంబును బిన్నటనాఁడె కోసి న
ట్టుల మనస్స్నేహ మిప్పుడు కమన్ద్వరితంబుగఁ ద్రెంపివేయఁగా
వలసె, నహా యిఁకేమి టిటువంటివనుల్కరి బుట్టునంచు నే
గలనయినన్ దలంచి యెఱుఁగన్ గుణసాగర మిత్రశేఖరా,"

నేనుమాత్రము దలంచియుంటినా? మనదురదృష్ట మిటుల సంభ
వించినది. [మరలఁ జదువుచున్నాఁడు.[

మ. "అకటా! యేమనివార్తియుదాన, నిఁక సన్యాయంబుగావించిన
న్నొక యజ్ఞానుని కీయ నాపితరు లుద్యోగించియున్నారు మీ
రిఁక నేదైన నుపాయముల్ దలఁచి న న్నీదుఃఖవారాసినుం
డి కృపన్ గట్టున జేర్పరే దయనిరూఢిన్ జూపరే ప్రోవరే."

ఏమిచేయుదును నాకిప్పుడేమియుఁ దోఁచకున్నది. నే నాయూరు
పోవుట న్యాయమగునా? పోయిమాత్ర మేమిచేయఁగలను చిత్ర
కేతుఁడును నాతనిభార్యయు నీవిషయంబునగట్టిపట్టుపట్టియున్న
పుడు నేనేమయినచేయఁగలుగుదునా? అదియునుగాక నేనీసమ
యంబున నాయూరుపోయిన నన్ను వారందఱునిర్లక్ష్యభావము
తోఁ జూతురు. అప్పుడు నాయుద్యమ మెంతమాత్రంబును నెర
వేర నేరదు. ఏవిధమున నాసుగుమణిని సంపాదించుట. హా!
దైవమా! దీనజనపరిపాలనశీలా! పిన్ననాటనుండియు నాహృద
యంబుననొక్కరీతిని నిల్పిన నాకన్యామణినాకులభించుటనున్న
యేనా? [విశేషపరితాపంబుతో] ఓసుగుణమణీ! సుగుణంబుల
కుప్పవగు నీవు నాకులభించి సుఖంబిచ్చెదవనినమ్మియుంటినిగాని
యిట్టివియోగము సంభవించునని తలంచియుండలేదు. నీవులేని
బ్రతుకువలన లాభ మేమి? అహా!

చ. మనము గలింగియుండిన సమాదరణంబునఁ జెంతఁ జేరి వం
తను మరపింతు వీవు ప్రమదం బగుమాటల నాడుచుంటి, నా
తను విఁకఁ గాచ పాత్రరహితంబగు దీపముగాదె నీవు చెం
తను వసియింపకున్న నిఁకఁ దాళఁ దరంబె వియోగ మోచెలీ!
[గుండెలు బాదుకొనుచు నిష్క్రమించుచున్నాఁడు.]

# సుగుణమణి.

## చతుర్థాంకము.

### అరణ్యసీమ.

[సుగుణమణి ప్రవేశించుచున్నది.]

సుగు——సీ. వినిపింపఁ గదరె యోవిహగోత్తములార!
పుష్పగిరికిమీరుపోవువారె
కరుణతోఁ దెల్పరే హరిణపోతములార!
పుష్పగిరికిమీరుపోవువారె
ముదముతో నెఱిఁగింపఁ గదరె మేఘములార!
పుష్పగిరికిమీరుపోవువారె
వచియింపరే చేరి వాయుడింభములార!
పుష్పగిరికిమీరుపోవువారె

ఆ. వె. ప్రేమతోడఁ జెప్పరే సుగంధములార!
పుష్పగిరికిమీరు పోవువారె
సరవిఁ జెప్పఁ గలరె సాంధ్యరాగములార!
పుష్పగిరికిమీరు పోవువారె.

(కన్నీరువిడచుచు) నాతండ్రియిట్లువిడచి యూరులు పల్లెలుప్రయాణముచేసి విశేషకష్టంబులపాలయితుదకీవిపినభూమికే తెంచితినిఁ ఇచ్చటనుండి యీదుష్ట మృగోరగంబులఁ బారినుండి తప్పించుకొనిపోయి పుష్పగిరిలోన నామనోనాథునిఁ గనుఁగొనవలయును. పుష్పగిరి యింక నెంతదూరమున్నదో యింకనెన్ని దినంబులు ప్రయాణము చేయవలయునో చెప్పువారిచ్చటఁ గాన

రాకున్నారు. ఈయరణ్యమధ్యంబున మనుష్యసంచారముండదు గదా! ఆపయిన సాంధ్యసమయ మయినది. ఈసమయంబున నిచ్చట కెవ్వ రేతెంతురు? ఈరాత్రి నే నెచ్చటఁగడుపుదును? ఇఁకఁ గొంచెముదూర మేగిన నూరేదయిన గోచర మగునేమో (పరికించిచూచి) చూచినకొలఁది యరణ్యమే కనఁబడుచున్నది గాని మఱియొకటిలేదు. ఓ! కాంతారత్నమా! మీరిచ్చటికేగుదెంచి యీసమయంబున నాకష్టంబు నివారింపరాదా? మిమ్ములఁబాసి కష్టంబు లనేకంబులు పడి మీయుష్మ కీర్తించుచున్న నన్నీసమయంబున రక్షింపరాదా? అయ్యో! ఏమి నాకీవెత్త? (ముఖము వంచి విచారము నభినయించుచు) ఈఘోరారణ్యమందునఁ గాంతారత్నము వచ్చు టెట్లు? అయ్యో! ఈకాననంబునుండి వెడలి యీ నామనోహరాంగునిఁ గలసికొన గలుగుదునా? (ఆలోచించుచు నూరకొనియున్నది.)

[విజయసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విజ—(నలుదిక్కులను బరికించి)

శా. ఈయుగ్రాటవి కేగుదెంచి తిఁరుగ నా కెంతో నయుక్ గానరా
దాయాసంబు శమించుకొందు నిట వృక్షానీకముం జేరి

[ఒకచోట వృక్షసముదాయంబులనీడ కేగి కూర్చుండుచున్నాఁడు.]

సుగు—ఓ క్రూరమృగసంతానంబులారా! ఓ విహంగసమూహంబులారా! ఓ దుష్టజననికాయంబులారా! నన్నీకాంతారసీమనుండి తప్పించి నామనోహరునియొద్దఁ జేర్పుఁడు. (త్రోవ వెతుకుచున్నటుల భినయించుచున్నది.)

విజ—యాహా!

యేమీ! యొక మోహనాంగి మృదువాక్యంబు ల్వినవచ్చెనా
చాయం బోవుద నీక్షణంబున సమస్తంబు న్వినన్ గోరుచున్

[లేచుచున్నాఁడు.]

సుగు—ఎచ్చటఁ జూచినను దిన్నని మార్గము గనఁబడకున్నది. ఏమార్గంబును బట్టి పోయిన నెటుపోవుదునో ఆహా! ఏమి! ఎంతచిక్కులోఁ బడితిని. [విచారము నభినయించుచున్నది.]

విజ—ఎవరో కన్యామణి యార్తప్రలాపంబులు చేయుచుఁ దోవకై యరయుచున్నది. నేను స్వయంబుగఁ బోయి యామెను గలసికొందును [ధ్వని వినినవైపునకుఁ బోయి] ఎవరీకన్యకామణి? ప్రయాణాయాసంబుచే వేసటఁ బొంది వసివాడియున్నది.

చ. వెలవెలఁబారియున్న ప్రతిబింబపటంబును బోలి సత్కళా
విలసవమింతలేక కనుపించెడు నీతరుణీలలామ

[బాగుగనామెను విలోకించి] యీ

కలికిముఖంబు నెచ్చటనో గాని కనుంగొనినట్టు లుండె నె
క్కడఁగనుగొంటినో యిఁకను జ్ఞాపకమించుక లేదుచూడఁగన్

ఆమె ముఖావలోకనంబు చేసినతోడనే నాకొక విధమయిన భ్రాతృవాత్సల్య మంకురించినది. ఈమె యెవ్వరో కనుఁగొనియీామె వృత్తాంతమంతయు నేనుపూర్వకగఁ దెలిసికొందును. (చేరంబని)

ఉ. ఎందులదాన వీవు, పతియెవ్వఁడు, నీదుసుహృజ్జనంబు లెం
దెందు వసించుచుందురు వహింపఁగరానివిచార మొందుచున్
మందను దప్పి కానలభ్రమన్ విహరించెడు మేకరీతి నీ
విందుఁ జరింపనేల? వచియింపు సమస్తము వేగముగ్మలీ!

సుగు—(ఊరకొనియున్నది.)

విజ—సోదరీమణీ! ఉత్తరమీయక యూరకుంటివేమి? సోదరభావముంచి నేనడిగినప్రశ్నలకు త్తరం బిమ్ము, నీకు సంభవించిన యాపద యేమియును లేదు.

సుగు—ఆర్యా! మీరు భ్రాతృవాత్సల్యముతో నన్నంతగాఁ బలవంతపెట్టుచుంటిరిగాన వినుండు చెప్పెద. నేను శ్రీనగరవాసియగు చిత్రకేతునికొమార్తెను.

విజ — (ఆశ్చర్యముతో) ఏమి నీవు చిత్రకేతునికొమార్తెవా? ఆతనికిని నాకును బరిచయముగలదు. నాపేరు విజయసేనుఁడు. నిన్ను జూచినట్టులు జ్ఞాపక ముండెనుగాని యెక్కడఁ జూచితినో మాత్రము దెలియకున్నది నీవు చిత్రకేతుని కొమార్తెవా అమ్మా!

ఉ. ఓరమణీలలామ సుగుణోజ్జ్వల న్యాయకళాకలాపభ
ద్ర్యాఢ్యరుచరిత్ర యార్యవినుతోన్నత సాధువచఃప్రభావ యి
ట్ల్యారివనాంతరంబునఁ బ్రమోదము దక్కి చరించు టేల శం
పారుచిరాంగి సత్యవతి భద్రమగుం దెలియంగఁ జెప్పుమా

సుగు—ఉ. ఓకరుణావతంస సుగుణోజ్జ్వలభూషణ! యేమిచెప్ప న
న్నీకరణిఁ దయారసవిహీనపరుండయి నాదుతండ్రి బల్
శోకములోన ముంచె, నిఁకఁ జూడఁగ నాకిట దిక్కుగాన ర
య్యో! కరుణించివేగ మొకయొద్దునఁ జేర్పగదయ్య మ్రొక్కెదన్.

విజ—ఏమి! నీతండ్రి నిన్నీదుఃఖవార్ధిలో ముంచెనా? కారణంబేమి?

సుగు—(కన్నీరు విడుచుచున్నది.)

విజ—ఏడవకు. సోదరీ ఏడవకు.

సుగు—ఆర్యా! నాహృదయంబు గళారత్న మనుబాలునిమీఁద లగ్నమయి యాతని వివాహంబు చేసికొనఁగోరుచుండెను.

విజయ—గళారత్నమును నే నెఱుఁగుదును. తరువాత. తరువాత.

సుగు—ఇట్టులుండ నాతలిదండ్రు లిద్దఱును నడ్డమువచ్చి నాయిష్టంబు నెరవేర్పక మఱియొకని వివాహముసేయ నిశ్చయించిరి.

విజ—తరువాత

సుగు—ఆబాలునియందెంతమాత్రంబును నామనంబు పోయినదికాదు అందుచే నాతని వివాహ మాడనని చెప్పితి అటుపయిని తల్లిదండ్రు లిద్దఱును నన్ను విశేషముగా బలవంతపెట్టిరి కాని నేనందులకియ్యకొనలేదు. అంత. నాజనకుండు,

చ. కనదురు విస్ఫులింగములు గన్నులరాల మహోగ్రుఁడై నిశా
తనిబిడసాయకంబులవిధంబునఁ గ్రూరములైన పల్కులన్
మనమదలంకఁ జేసి యవమాన మొనర్చిన నట్టియుగ్రకో
పనుకడ నుండలేక యిటువచ్చితి దైవమె నాకుఁదోడుగాన్.

విజ—అయ్యో! ఏమిది? కళారత్నమునకు నెందుచే వివాహము సేయ
రాదు?

సుగు—వారికిఁ గులశీలసౌదార్యసంపదరయం దీతఁ డీఁడు కాఁటట!

విజ—ఏమి యీయాశ్చర్యము! అతఁడత్యంత విద్యావంతుడే, అతని
పాటిటి గౌరవము వీరి కెవ్వరికిని లేదు. నిజంబు నాలోచించినచో
అయ్యో చిత్రకేతుఁ డెంతవెఱ్ఱిపని జేసెను. సుగుణమణీ! నీవును
నిందులో వేగిరపాటు జెందితివని నాయభిప్రాయము.

ఉ. తాలిమిఁ జేసి కష్టసముదాయము నోర్చి మనంబునందు నీ
బేలతనంబు మాని, పరభీతి తొరంగ విశేషధైర్యముల్
దాలిచి కార్యసాధన మొనర్చినఁగాని విచార మీగతిన్
జాఁలగఁ బొందుచుండిన ఘనం బగుకోరిక లందవచ్చునే!

గనుక నీవింకను నోరుపుజంది మీతండ్రి నీప్రక్కకు మరల్పవలసినది.
అట్లుచేయక యాతనికిఁ గోపమువచ్చినంత మాత్రంబున నిట్టు
లడవులపాలయిపోవుట నీకు న్యాయముకాదు కాని యిపుడు
నీ వీలాగున నెచ్చటికిఁ బోయెదవు?

సుగు—నామనోహరాంగుఁడైన కళారత్నమును గలసికొనఁ బుష్పగిరి
కేతుంచుచున్న దాన.

విజ—ఆహా! ఏమి, నీసాహసము. నేప్రియుని గలసికొనుటకుఁబుష్పగిరికిఁ
బోయెదవా? కాని కన్యామణీ

చ. ఘనతరశోకభారమునఁ గన్నులు బాష్పజలంబు లూర, నా
ననమ్మున విన్నబాటొదవ, నైజమనోజ్ఞశరీర మొందలన్

గనలఁగ క్షుత్పిపాసల వికావికత్తై నిలువెల్ల డస్సి, యి
ట్లనుచితరీతి గారడవులందుఁ జరింపఁగ నీకుఁ జెల్లునే?

సుగు—ఆర్యా! దుఃఖాకులచిత్తనయి సంతోష మనునది యూనంతయు
నెరుంగక, విశేషమైన యలజడిఁ బొందుచున్నపుడు సమ్మోద
భావం బెట్లు గనఁబడును?

విజ—చ. ఇదియొక ఘోరమైన వనమిక్కడ క్రూరమృగాదిసంతతుల్
మెదలుచు నుండు గావున నిమేషము నచ్చట నిల్వరాదు పో
వుద మెటకేని యీవిపినభూమిఁ జరించుటలింక మాని యో
సదమల శోభనాంగి యటు సల్పిన భద్రమగు న్నిజంబుగన్.

[ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.]

రంగము ౨.

శ్రీనగరము:—శ్యామకేతుని మందిరము

[శ్యామకేతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శ్యామ—[తనజేబులోని సుగుణమణిపటమును దీసి విచారముతో]

సీ. ఆలోచనాన్వితంబై యలరువిశాల
ఫాలమా యిది సుగుణాలవాల
మనకళారత్నమందున దృష్టి నిల్పిన
నేత్రంబులా యివి నిర్మలాంగి
జలిబిలిపాటముద్దులుగుల్కఁ బాడెడు
మృదుకంఠమా యిది సదయహృదయ
ముదముతోఁ జదువంగఁ బుస్తకంబులఁ బట్టు
హస్తంబులా యివి యమలచరిత

తే. గీ. వీనిఁ గనుఁగొనఁ బటమందె కాని, నీదు
దివ్యదేహంబునందు, సంతృప్తితోడఁ

అయ్యయో! ముద్దుచెల్లెలా! యరసిచూడ
నిన్ని సౌఖ్యంబు లేక నాకు నున్నయేన?

[కన్నీరు విడచుచు]

ఆహా! ఎంత దురదృష్ట వంతుఁడను. చెల్లెలా యని యింక నెవరిఁబిల తును ఓసుగుణమణీ! నీవు తిరిగి నాకండ్లఁ బడుదువా? ఈశరీరం బుతో నిన్నుఁ జూడఁ గలుగుదునా? నీ వీ శ్రీనగరంబున కేతెం తువా అయ్యో! (నిట్టూర్పు పుచ్చుచున్నాఁడు.) ఓ తల్లి దండ్రులారా! మీరెంత కఠినాత్ములైరి? మీరాసుగుణమణి యూహల నెందుచే నెరవేర్పరాదు? మీ కేమిహానిసంభవించును ఆమె యిష్టపరికారము జరిగించినను నామె సుఖంబుగ జీవించును ఇప్పు డామె రూపమయినఁ గండ్లకుఁ బడకుండ పోయినదికదా? (ఆమెపటమును మరలఁ జూచుచు) అయ్యో! చెల్లెలా! ఈదివ్య రూపంబును మరలఁ జూచుటెట్లు? చిన్నతనమునుండియువిశేష స్నేహంబున మెలఁగుచు నొక్కహృదయంబుతో నుండియున్న మనమిప్పు డెడబాయవలసివచ్చెనుగదా! ఏ నేమి సేయుదును? (గుండెలు బాదుకొనుచున్నాఁడు) నీవుఁ గళారత్నంబును వివాహమాడి సుఖంబు ననుభవించు చుండ నేత్రపర్వముగఁ జూడఁ దలంచుకొని యుంటి. అదియంతయుఁ గడతేరెగదా! నిన్నప్పుడప్పుడు నాయింటికిఁ దీసికొనివచ్చి ముద్దు ముచ్చటలు జరుపఁ దలంచియుంటిని. అదియుఁ గూడ నడఁగి పోయెను గదా! నీవు నాముద్దు చెల్లెలవని యెంచి యెన్నియో విధంబుల నిన్నాదరింప యత్నించితిని. అవియన్నియు నిష్ఫలంబులాయెనే. ఆహా! (ఆలోచించుచు) తండ్రీ!

ఉ. కూరిమిఁగన్నకూఁతు, నయకోవిదురాలి, వనాంతరంబులన్
జేరఁగ జితకేతుఁడు వినిందితుఁడై యిటు పంపినాఁ డహా

క్రూరమనస్కుఁ డీతఁడు ప్రకోపమునఁ బెంచు జనంబు లాడి నిర్వారక నిందసేతురని భావమున్నను నెఱుఁగ నక్కటా!
ఇప్పుడు నే నేమిచేయుదును? చెల్లెలా! దైవానుగ్రహంబున నీవుఁ గళారత్నంబును గలసికొనిన నీకష్టములు నష్టీకృతములౌను. లేనిచో నిన్నుగురించి యేమని యాలోచించుకొనవలయునో తెలియకున్నది. (పరితాపమునొందుచు) అయ్యో! ఎంతచింతించినను గార్యమేమి? (నిష్క్రమించుచున్నాఁడు)

రంగము—జయపురబాహ్యసీమ.

[కళారత్నము ప్రవేశించుచున్నాఁడు.]

కళా—(నడచుచు) ఈయూరి కేతెంచితినిగదా. ఇంక నీపట్టణంబున బాగయోడనెక్కి శ్రీనగరంబునకుఁ బోవుదును అచ్చట నేమి జరుగునో చూచెదనుగాక. సుగుణమణి నెట్టులయినఁ గలసి వివాహమాడవలయును. అప్పుడుగదా నా ప్రయత్నము లన్నియు సఫలీకృతములౌను (నడచుచున్నాఁడు.)

[సుగుణమణి ప్రవేశించుచున్నది.]

సుగు—(నడచుచు) అరణ్యప్రదేశములు, నూరులు, పల్లెలు, దాఁటి యీపట్టణం బేతెంచితిని ఇచ్చటనుండి పుష్పపురికిఁ బోవలయును. ఇంక నెన్నిదినంబులు ప్రయాణమై పోవుదునో (ముందునకు జూపు నిగిడించి) ఎవ రాముందు నడచువారు? (పరికించి చూచి) కళారత్నమువలెనే నడుచున్నాఁడు (ఆలోచించి) కళారత్నమేనా—అతఁ డిచ్చటి కేతెంచుటకు గారణంబేమి? (మరలదృష్టినిగిడించి) నిజముగఁ గళారత్నమువలెనే కనుపించుచున్నాఁడు ఎంతమాత్రమును భేదంబు లేదు. ఏమిరి యీయాశ్చర్యము, నాకాతనియందు మనంబంతయు నిశ్చలంబుగ నాటికొని

యుండుటచేనితఁడుగాఁడైననునాతనినవలెనేకనిపించుచుండెనాశిక్కొం చెము వేగంబుగఁబోయి యాతని గలసికొని చూచెదను. (వేగ ముగనడచుచు) ఏమినాహృదయముతటతటఁగొట్టుకొనుచున్నది (చేరువకుఁ బోయి) కళారత్నమువలెనే యన్నివిధంబులఁ గను పించుచున్నాఁడు. ముఖముమాత్రము గనుపించి యుండలేదు అయ్యది విస్పష్టంబుగగనుపించినచోనన్నిసందేహములుదీరును. (ఇంకగొంచెము వేగముగనడచుచు) సందేహము లేదు. కళా రత్నమే. (సత్వరంబుగఁబోయి కౌగిలించుకొనుచున్నది.)

[ఇద్దఱును మూర్ఛపోవుచున్నారు.]

[చంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చంద్ర (నడచుచు ఆలోచించుచు) ఈసారి పోవుచుంటినిగదా. ఏమ గునో చూచెదనుగాక! కళారత్న మెంతమాత్రమును మా సంబంధమున కొడఁబడఁడనితోఁచుచున్నది. క్రిందటిసారిపోయి మాటాడినప్పుడే యీాతని మానసంబు గనిపెట్టితిని. అతనికా సుగుణమణియందు విశేషప్రేమాతిరేకంబున్నట్టును మరియొక రిని బెండ్లియాడనట్టును స్పష్టపడినది. మాపినతండ్రిగారి ప్రో త్సాహమువలన నేను పుష్పగిరికి పోవుచుంటిని గాని నామనః పూర్వకంబుగ మాచెల్లెల నాతఁడంగీకరించుననిని తోఁచదు. (పరికించి యబ్బురపాటుతో) వీరెవ్వరు? ఎవరోమూర్ఛాక్రాంతు లయిన సతీపతులవలెఁ గాన్పించుచున్నారు. (బాగుగఁ బరిశీ లించి) ఆహా! వీరలు మరెవ్వరునుగారు. సుగుణమణియు కళా రత్నమును. వీరలిచ్చటికేటీరునవచ్చిరి? ఇందులకుఁగారణ మేమై యుండును? ఆహా! వీరిప్రేమాతిరేకము! వీరిస్థితినిబట్టిచూడ నాకస్మికముగ నీస్థలంబునఁ గలిసికొనినట్టు లగుపడుచున్నది.

సీ. సంసారసౌఖ్యంబను సౌరభ్యమునఁ గ్రోయు
గాఁ బచరించు చుక్కనిజంత్ర
మీర్ష్యాది శత్రురాజేంద్రుల జయించు
తేజితనంజ్ఞికాదీపరాజి
మైహికాద్యఖిలసౌఖ్యంబు నందంగ
జీవయాత్రకుఁ ద్రోవఁ జేయుచుక్క
పత్నీపతులు తొట్రుపాటులు లేకుండ
నింపుగా నిలఁబడు నిరుసుకఱ్ఱ

తే. గీ. దలఁప నన్యోన్యరాగంబు, దాని గలిగి
సంతతంబును సంతోషసరసిఁ దేలు
చున్న దాంపత్యసౌఖ్యంబు లెన్నఁదరమె?
యహహా! భూలోక స్వర్గమయ్యదియ కాదె?

ఆహా! ఇట్టియన్యోన్యానురాగంబు గలిగినవీరికిఁ బెండ్లి సేయకుండుట చిత్రకేతున కెంతయు లోపంబు, మఱియును మాచెల్లెలను వివాహమాడుమని మేము గళారత్నమును గోరుటయు సనుచితంబు. ఎట్లునాకళారత్నమును నీసంగతి యడుగుట?అయ్యోవీరి యన్యోన్యప్రేమాతిరేకంబుఁ జూడ నాకత్యాశ్చర్యంబు గావించుచున్నది. నే నీసమయంబున నిచ్చట నుండుట యుచితంబు గాదు. కనుక పోయి యావలికథ కనుగొనియెదను.

[నిష్క్రమించుచున్నాఁడు.]

[ఇద్దఱును మూర్ఛదేరుచున్నారు.]

కళా — ఆశ్చర్యము నభినయించుచుఁ దనలో ఏమి! యీయాశ్చర్యము!

[సుగుణమణి ముఖంబు పరికించి చూచి ముద్దుపెట్టుకొని]

చ. సుగుణమణీవధూటి! పరిశుద్ధచరిత్రి మనోహరాంగి యో
గ్యగనులమిన్న యేమిటిది ? చోద్యము దైవకృపన్ మహాత్ముగా

జిగితళుకొందు కొ్రిమ్మెరుగు జిత్రమునన్ గనుపించియుంటి వి
ట్లగుననియెన్నఁడున్ దలఁపనైతి మనంబునఁ బ్రేమపుంజమా!
(బిగ్గఁగౌఁగిలించుచున్నాఁడు.)

సుగు—ప్రియమిత్రమా! నేనును నిట్టులసంభవించుననియెన్నఁడనుకొని యుండలేదు. దైవవశంబున మిమ్ముల నిచ్చటఁ గనుఁగొంటి.

చ. వినుఁ డిఁక నాచరిత్రప్రియమిత్రమ! శ్రీనగరంబులోన నా
జనకునితోడమీఁకొరకుఁ జాలవివాద మొనర్ప నాతఁడున్
గనలి విశేషకోపమున నన్ దనమ్రోలననుండి త్రోయ మి
మ్మును గనఁగోరి యిట్టులఁ బ్రమోదముతోడఁ జరించివచ్చితిన్.

కళా—(ఆశ్చర్యముతో)సుగుణమణీ! ఏవిధంబుననీవుప్రయాణంబుసేసి యూరుపల్లెలు దాటి పుష్పగిరిఁ జేర నేతెంచితివి? నీసాహసౌ దార్యంబులు మిగుల శ్లాఘాపాత్రంబులుగా నున్నవి.

చ. అమలచరిత్ర! నీవు దయ నంపిన నుత్తర మందగానె చా
ల మది విచార మొంది యిటులన్ నినుశ్రీనగరంబులోనఁ జూ
త మనుచు నెంచి రేపె ప్రమదంబున నోడను నెక్కవచ్చితిన్
దమకముమీఁద నీవిచట దైవకృపన్ గనుపించితంతటన్.

నెచ్చెలీ! శ్రీనగరంబునకువచ్చునుద్దేశ మెగాని నిన్నటగనుంగొని నా కోరిక లీడేర్పగలనో లేదో నమ్మియుండలేదు! ప్రియసఖీ!

సీ. బ్రదావనములోని పల్కులే మన కింక
భరతవాక్యములంచు నరసికొంటి
నిను నాడు చూచుటల్ మనచూడ్కులకు నింకఁ
బొలిమేర యనుచు నే దెలిసికొంటి
మరి నిన్ను బాయుటల్ మనస్నేహమున కింకఁ
దీరుదల యని బోధించుకొంటి
మున్నటియుత్తరంబు మనజాబుల కింకఁ
దుదిచీటి యని సరి తూఁచికొంటి

తే. గీ. ఆహాహా! సుగుణమణీ! మన కట్లుగాక
దైవ మింకొకపరి కృపఁ దలఁచినాఁడు
కలరె ననుబోలు ధన్యులు దలఁప నవని
నేమి చెప్పుదు నాభాగ్య మిప్పు డబల!

సుగు— నీభాగ్యమున కేమి, నాభాగ్యము పండినది కాననాంతరంబులు దాటి, పట్టణంబులు దాటి మిమ్ములనిచటనే కనుగొన్న నాయదృష్టమేమని చెప్పనగును.

కళా— ఇంకఁ బట్టణ మరమైలు దూరములోనున్నది. అచటికిఁబోయి యొకధర్మసత్రంబున విడిసి రేపటిదినంబున నేమనము సుఖంబుగఁ బుష్పగిరికి పోవుదము. (ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

రంగము—ధర్మసత్రము.

[ఇద్దఱు బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.]

ప్రథమ — మనమింకఁ బుష్పగిరికిఁ బోవు ప్రయత్నమును జేయవలెను గదా! ఇంకను నీవిట్టులనే యుంటివి.

ద్వితీయ— ఏమిచేయుమనెదవు? పొగయోడప్రయాణము నాకుమిగుల నాయాసము చేసినది. ఇచ్చటనుండి పుష్పగిరికి పోయి యచట మనకార్యంబు నెరవేర్చుకొని మరల నోడనెక్కి ప్రయాణము సేయవలయును. ఎటుసేయుదునో నాకుఁ దోఁచకున్నది.

ప్రథమ — నీవిట్లాయాసపడుటేల? కష్టపడినఁగాని ద్రవ్యము రాదుగదా! సమయమువచ్చినప్పుడే కష్టపడవలయును లెమ్ము నీ యాయాసము నింక కొద్దిదినంబులవరకుఁ గట్టిపెట్టుము. పిమ్మటనీవు తిరిగి సుఖింతువుగాని.

ద్వితీయ— ఏమిసుఖముఁ బొందుదునో గాని యిప్పుడు మాత్రము నాకీప్రయాణము విషతుల్యంబుగ నున్నది. ద్రవ్యమున కాశించి

యిందుల కియ్యకొంటివిగాని లేనియెడల నిట్టికార్యంబునకు బూనుకొనను.

ప్రథమ—ఇంక నెప్పుడుఁ బూనుకొనవలదు లే. ప్రస్తుతమిందులకొప్పుకొంటివిగాన నీకార్యము మాత్రము నెరవేర్పుము లెమ్ము. మనము ప్రయాణప్రయత్నంబు గావించెదము.

ద్వితీయ—(లేచుచు) అబ్బా! నన్ను తినివేయుచుంటివిగదా! ఇంతకు నాసుగుణమణి కనపడునో లేదో కాని ప్రస్తుతము మాత్రము మనపని పట్టుచున్నది. (ఇద్దఱునునచట నడచుచున్నారు.)

[సుగుణమణి ప్రవేశించుచున్నది.]

సుగు—ఇంకను నామనోహరుండు ప్రయాణసన్నాహంబునకుఁ బోయి రాలేదు. మిగుల నాలస్యము కావచ్చుచున్నది.

ప్రథమ—అదిగో మన సుగుణమణి యచ్చటనున్నది.

ద్వితీయ—ఏదీ! మనసుగుణమణియేనా ఆమె? మన మటు పోదము రమ్ము. (ఇద్దఱును బోవుచున్నారు.)

సుగు—[నిశ్చేష్టురాలై నిలుచుండియున్నది.]

ద్వితీయ—సుగుణమణీ! నీ విచ్చట నెందు కుంటివి? నీవు పుష్పగిరికిఁ బోయితివని నీజనకుండువిని మమ్ముల నిన్ను వెదకితీసుకొనిరమ్మని పంపియున్నాఁడు. శ్రీనగరంబునకుఁ బోవుదముఁ రమ్ము,

సుగు—[మాఱుపడి నిలుచుండి యున్నది.]

ప్రథమ—అమ్మా! సుగుణమణీ! నీకు భయ మేమియును లేదు. తొందర జెందకుము. నిన్ను నరచేతిలోని పుష్పమువలె గాచుచు శ్రీనగరంబునకుఁ గొంపోయి నీజనకుని కప్పగించెదము.

సుగు—విప్రవరులారా! మిమ్ముల నాజనకుఁ డెందుకుఁ బంపెను?

ద్వితీయ—నీవుపుష్పగిరికిఁబోయితివని విజయసేనునివలనవిని మనంబునఁ బరితాపంబుఁ బొందినిన్ను దోడితెమ్మని మమ్ములను బుష్పగిరి

కంచెను నేటిదినంబుననే మూడదిగి యిచ్చటికే తెంచిపుష్పగిరికిఁ బోవ యత్నించుచుండ నదృష్టవశంబున నిక్కడ గాన్పించితివి. నీ విచ్చట నుండుటకుఁ గతం బేమియో యెఱుంగ కున్నాము. అమ్మా సెలవిమ్ము.

సుగు—బ్రాహ్మణోత్తములార! చెప్పుటకేమున్నది? నేను శ్రీనగరంబు బయలు వెడలి యూరులుపల్లెలు ప్రయాణంబు సేసి, గహనంబులు దాటి యీపట్టణంబునకు నిన్నటిదినంబున వచ్చుచుండఁబట్టణం బున కరమైలు దూరంబునఁ గళారత్నమును గలసికొంటిని.

ఇద్దఱు—ఏమి? కళారత్నమును గలిసికొంటివా! ఏఁడీ అతఁడు?

సుగు—పుష్పగిరికిఁ బ్రయాణసన్నాహంబు సేయనిప్పుడే పట్టణంబులోని కే తెంచియున్నవాఁడు. ఇఁకఁ గొంచెము సేపటికి కే తెంచును.

ప్రథమ—(ద్వితీయునితో రహస్యముగ) మన మీసమయంబులోనే సుగుణమణినవతలికి తర్లించవలయును. లేనియెడల నిఁకొకనిమి షంబునకుఁ గళారత్నమే తెంచు. అప్పుడు మన ప్రయత్నము లన్నియు నిష్ఫలంబులగును.

ద్వితీయ—నీవుమంచియుపాయమే చెప్పినావు ఇదియును గాక యింకొక చిత్రమున్నది. శ్రీనగరంబునకుఁ బోవు పొగయోడ రేవులో వేఁచియున్నది, కావునఁ దక్షణంబున నీమె నందులో నెక్కించి దీసికొనిపోయెదము.

ప్రథమ—(ప్రకాశముగాఁగోపముతో) సుగుణమణీ! మేమిచ్చట నాల స్యము సేయఁదగదు. నిన్ను గనుగొన్నవక్షంబునఁ బట్టితీసికొని రమ్మని నీతండ్రిగారి యాజ్ఞ.

ద్వితీయ—నిజమేనమ్మా సుగుణమణి గనుక నీవుప్రయాణోన్ముఖురాలవు గమ్ము. ఆలస్యముఁజేసిన ప్రమాదము సంభవించును.

సుగు— భూసురులార! నాప్రియుండైన గళారత్నము పట్టణంబులోనికిం బోయియుండెను. యిప్పుడేయేతెంచును. పిమ్మటనన్ని కార్యంబులును జక్కఁబడును.

ద్వితీయ— (కోపముతో) మాకదేమియుఁ బనికిరాదు రమ్ము లెమ్ము ఆలస్యము చేసిన నచ్చట బోగయోడ మించిపోవును. కనుక నిన్ను తక్షణంబు దీసికొనిపోవలయును.

[ఆమెను లాగఁబోవుచున్నాఁడు.]

సుగు—(విచారముతో)

చ. వినుఁడొక విన్నపంబు పృథివీసురులార! దయాళులార! స
ద్వినయధునీధులార! సమధీకృతి న్యాయవిచారులార! నె
మ్మనమున నాదుదుస్థితి సమగ్రముగాఁ దలపోసి చూచి నా
జనకునితోడ మీరయిన సర్వమునుం దయచేసి చెప్పరే.

(పాదములమీఁదఁ బడుచున్నది.)

ప్రథమ— అమ్మా! సుగుణమణి లెమ్ము లెమ్ము నీ విట్లు చేయుట యుచితంబుగాదు.

ద్వితీయ—(కోపముతో) నీ దీనాలాపంబులకు మా మనంబులు కరఁగునవి కావు. నీతండ్రీ యాజ్ఞప్రకారము నిన్నీ తక్షణంబున గొంపోయి పోగయోడలోఁ బడవైచెదము ఇంకీయంశములో దయ దలంచువారము గాము.

సుగు—(కన్నీరు విడుచుచు) ధాత్రీసురోత్తములార నన్నెందుచేమరలఁ గష్టంబులలో ముంచెదరు? నేను దైవకృపవలన నాప్రాణనాథునిఁ గలసికొంటిని. ఇంక నామనోరథం బీడేరినది. నాతల్లిదండ్రులకును నాకును సరి, ఇఁక వారితో నేమియు సంబంధము లేదు. నా మనోహరుని గలసి సకలసౌఖ్యంబుల నుండెద. కనుక మీరు నాయందు దయారసప్రపూర్ణమానసులై నన్ను విడుతురుగాక.

ద్వితీయ—ఏమి నిన్ను విడచుట; అట్టిమాటస్వప్నంబులోనైనఁ దలంప
కుము. నిన్నుఁదీసికొనిపోయి నీప్రియునెదుటనిలిపితీరవలయును.
అప్పుడుగదా చూతువుగాని మాప్రతిజ్ఞ.

సుగు—అయ్యో! (నిట్టూర్పుపుచ్చుచు) విప్రపరేణ్యులారా! నన్నినిమి
షంబున నింత బాధపెట్టి నాప్రియునుండి యెడబాసి తీసికొని
పోయిన నేమిలాభంబు సంభవించును? నాప్రియుఁడువచ్చువేళ
యయినది. ఇఁకఁ గొంచెము సేపు తాళుఁడు.

ద్వితీయ - అవేమియు నిచ్చటఁ బనికిరావు; నిన్ను దక్షిణంబున దీసికొని
పోవలయును. (పశ్చిమునివైపు తిరిగి) మనము చూచినకొలఁది
యిట్టులనే యుండును. కనుక నీమెను దీసికొనిపోయి బండిలో
నెక్కించుదము రమ్ము. (ఇద్దఱునునట్లు చేయుటకు యత్నకృతులై
యున్నారు.)

సుగు—(విశేషపరితాపంబుతో) ఓబ్రాహ్మణులారా! కొంచెము తాళుఁడు,
ఓకళారత్నమా! ఈసమయంబున నేపట్టణంబులోనికిఁబోవలసి
వచ్చెనా? అయ్యో! నన్నీదురవస్థనుండి తప్పించువా రెవ్వరు?
వీరెంత చెప్పినను వినకున్నవారు. నన్నీసమయంబునఁ బట్టి పోగ
యోజలోనైననుద్యుక్తులైయున్నారు. ఓదైవమా! నీకైనను
నాయందు గరుణ లేకున్నదా! ఇన్నికష్టంబులు బడినను నన్ను
గాచి నాప్రియునితోఁ గలపితివిగదా. ఇఁక నీవిషయంబులో
గూడ నాకు నీ వెందుచే నష్టపడరాదు. అయ్యో!

ద్వితీయ—చూచెదవేమి? రమ్ము. ఈమెను దీసికొనిపోయెదము,

(ఇద్దఱును సుగుణమణిదగ్గరకుఁబోవుచున్నారు.)

సుగు—అయ్యో! విప్రవర్యులారా! మీరిట్టుల చేయుట న్యాయమేనా?
ఇఁకఁ గొంచెము సేపు దాళరాదా?

ద్వితీయ— ఇఁకఁ దాళినఁ గార్యము లేదు(ప్రథమునితో)రమ్ము చూచెద వేమి (సుగుణమణిని బట్టిఁ బోవుచున్నారు.)

సుగు—అయ్యో! మీ రెంత చెప్పినను వినరుగదా! ఏమి చేయుదును? ఆఁగుఁడు; ఒకనిమిష మాఁగుఁడు.

(గోడమీఁద నేదియో వ్రాయుచున్నది.)

ద్వితీయ—చాలును ఇఁక చాలును వ్రాయుట కేమి లే. తరువాత శ్రీనగరంబునకుఁ బోయి వ్రాసికొనవచ్చును.

ప్రథమ—తాళుము తాళుము. అదేమిటియో పూర్తిగా వ్రాయనిమ్ము ఇఁక మన మెట్టులైనను దీసికొనిపోవ యత్నించుచుంటి నిశ్చయము చేసికొంటిమిగదా.

ద్వితీయ—అవును. అచటపొగయోడ మించిపోవుచున్నది సుగుణమణీ! నీ వాలస్యము సేయకుము రమ్ము. (ఆమెను లాగుచున్నాఁడు.)

సుగు—మీరింకొక నిమిషంబు యిచట నాగి యుండలేరా?

ద్వితీయ—(ప్రథమునితో)ఇఁక మనము చూచినఁ గార్యము లేదు. తీసికొనిపోదము రమ్ము. (ఇద్దఱును నామెను దీసికొనిపోవుచున్నారు.)

[కళారత్నము ప్రవేశించుచున్నాఁడు.]

కళా—(సుగుణమణినిగానక యాశ్చర్యముతో)ఏమి ఈవింత? సుగుణమణి కానరాకున్నది. ఎక్కడికిపోయియుండును?(ఆలోచించుచు) ఏమియిది మిగుల నాశ్చర్యముగా నున్నది (నలుదిక్కులను బరికించుచున్నాఁడు.) అన్నా! వింతగా నున్నదే? (ఒకగోడవైపు చూచి) ఇక్కడ నేదియో వ్రాసియున్నది. ఏమిటిది? ఇదివరకు లేదు, (చేరంజని తనలోఁ జదువుకొని) అయ్యో (నేలవ్రాలుచు బరితాపముతో) అయ్యో! సుగుణమణీ! ఎంతపని సంభవించినది!

చ. ప్రవిమలగాత్రి ముద్దుటతివా శిశుహస్తములోని వస్తువుల్
ప్లవగము వచ్చి యెత్తుకొని పారువిధంబుగ నయ్యో! నిన్ను వి

ప్రవరులు నేగుదెంచికడుబల్మినిదోఁచుకొనిపోయిరే మహా
జవమున నిన్ను దెచ్చియుఁక సంతస మొందుట సంభవించునే?

ఏమి నాకన్నులను నేనునమ్మలేకున్నాను. నేనాగోడమీఁదవ్రాతను నిజంబుగఁ జదివితినా? అది సుగుణమణి లిఖియించినదేనా? నాకింకొకసారి చూచినఁగానినమ్మకముపుట్టకున్నది ఇంకొకసారి చదివెదను [లేచిచదువుచున్నాఁడు.]

ఉ. ఓసుగుణావతంస! పురుషోత్తమ! శ్రీనగరంబునుండి ధా
త్రీసుర లేగుదెంచి సముదీర్ణత నాజనకాజ్ఞయంచు న
న్నీసునఁబట్టి యెంతపచియించిన నామొఱలాలకింపక
య్యో! నరవిన్ బ్రియుండపోగయోడకు దోకొనిపోయిరిప్పుడే.

ఆహా! ఇప్పుడు నిజంబుగ నమ్మనగును. అమితప్రయాసమున కోర్చి దుష్టమృగసంకులంబులయిన నడవులదాటి నన్నుగలియ నతి ప్రేమంబున నేతెంచిన నీకోసుగుణమణీ! మరలనెంతటికష్టము సంభవించెను! మనమిద్దఱముగలసికొంటిమిగదాయనియత్యంత సంతోషితాంతరంగుడనై యున్న నాకిప్పుడీబ్రతుకేమిసౌఖ్యంబు

ఉ. ఓలలితాంగి!నిర్మలగుణోజ్జ్వల! భూరిదయాప్రపూర్ణ నీ
తోడిదెలోకమంచుఁ బరితోషముఁ బొందుచునుండనయ్యయో
చాలయుపద్రవం బిటులసంభవమయ్యె, నికేమి సేతు, నో
లాలితదివ్యమూర్తి! యబలా! మనకింక ఋణంబు సెల్లెనా?
[కన్నీరువిడుచుచున్నాడు.]

ఇఁక నిన్నుఁగలసికొను టెట్లు? ఇప్పుడుపోయికలసికొందుమనినఁ బోగ యోడ యీరేవును నప్పుడేనదలిపోయెను. ఇంకొకవారముదినములు వేఁచియుండినఁగాని శ్రీనగరంబు వైపు పోవునోడ రానేరదు. ఆయోడనెక్కి ప్రయాణముచేసిశ్రీనగరంబునకుఁబోవుటకు సుమారు మూఁడు దినంబులుపట్టును. అప్పుడుపోయి సుగుణమణిని గలసికొనవలయును. ఆహా! ఏమి యింత యదృష్టవంతుఁడనా? నాకిఁక సుగుణమణికండ్లఁబడునా? నిన్నటిదినంబునన్నైన

సుగుణమణినిబుష్పగిరికిఁ దీసికొనిపోవ నైతిని. అంతజ్ఞానముండిన నన్నియు బాగుండును; నే నేమిచేయుదును? శ్రీనగరంబునుండి బ్రాహ్మణులీదినంబున నేగుదెంచి యీమెనుదీసికొనిపోవుదురని యెట్లు తెలిసికొందును? ఇంతటి దురవస్థ మరల సంభవించునని యెన్నఁడనుకొనలేదు. సుగుణమణినిఁ గలసికొంటినిగాన నిఁక యీమెను నెడబాయుదునని యెంచియుండ లేదు. ఆహా! సుగుణమణీ! నీవైనను నీతండ్రి నిన్నుఁగొనిపోవ బ్రాహ్మణులఁబంపుచుండెనని చెప్పి యుంటివి కావుగదా! ఏమి యింత వెఱ్ఱినాకు. ఆమె కాసంగతి యెట్లు దెలియును? ముద్దుకోమలీ; మనోహారిణీ! నేటితో మన స్నేహంబు సరియేనా! [దుఃఖించుచు] నిన్నుఁబాసి నే నీ ప్రపంచంబునఁ బ్రాణములతో జీవింపఁగలనా? అది యేటిమాట [ఆలోచించుచు] నా మనోహారిణిఁ జూచునుపాయ మేమి? ఎంత యాలోచించినను గనపడకున్నది నేను నువారము దినంబు లయినపిమ్మట వచ్చునోడ నెక్కి శ్రీనగరంబునకుఁ బోయిన నేమగునో! ఇది యొక్క యుపాయము గాన్పించుచున్నది. శ్రీనగరంబునకుఁ బోయిన సుగుణమణి నాకన్నులకు గనుపించునా? కనుపించినం గార్య మేమి? ఒకవేళ యీకొద్దికాలములో నేవివాహ మాచరింతునేమో! ఆహా [గుండెలు బాదుకొనుచు] సుగుణమణి మరియొకనిఁ బెండ్లియాడునా? ఏమి? ఎంతటివింత సంభవించెను ఒ పరాత్పర! మాకెంతటి యాపత్తు పెట్టితివి! మా కోరికలీడేర్పక పోతివిగదా! మా యిద్దఱి మానసంబులును నన్యోన్య ప్రేమానుబంధముచేతఁ గట్టిగఁ గట్టఁబడి విడిపోకున్నవి అయ్యో! అయ్యో! సుగుణమణీ!

మ. రమణీయోక్తుల మానసంబు నలలారం జేయుచున్ సర్వకా
లములందున్ మరితోడునీడవయి యుల్లాసంబు గల్పించుచున్
గమనీయాకృతి నేత్రపద్మముల కానందంబు గావింతు వం
చు ముదం బందితిగాని యిట్టు లగునంచున్ జూడలేనైతిగా.

[గుండెలుబాదుకొనుచు నిష్క్రమించుచున్నాఁడు.]

---

# సుగుణమణి.

పంచమాంకము.

రంగము—శ్రీనగరంబులోనివీధి.

[ఇద్దఱుస్త్రీలు చెరియొకప్రక్కనుండి ప్రవేశించుచున్నారు.]

[తెరలోఁగలకలధ్వని]

ప్రథమ — ఓసీ! నీవెట్చట కేగుచుంటివి?

ద్వితీయ—ఇంటికి బోవుచుంటిని.

ప్రథమ—ఉత్సవము చూడఁబోవుదము రా.

ద్వితీయ—ఉత్సవ మేమిటి?

ప్రథమ — నీ వింకను పెరటిదారి నేయుంటివా? ఉత్సవ మేమియో నీకు తెలియదా?

ద్వితీయ — నాకు తెలియదు.

ప్రథమ—చిత్రకేతునికొమార్తెయైన సుగుణమణికి రేపటిదినంబున వివాహము.

ద్వితీయ—ఆలాగునా? కళారత్నమునకే యిచ్చెదరా?

ప్రథమ—ఎంత వెఱ్ఱిదానవు; కళారత్నమునకిచ్చి పెండ్లి సేతురా?

ద్వితీయ—సరే రేపు పెండ్లి యయినయెడల నిప్పుడుత్సవ మేమి?

ప్రథమ—పెండ్లివార లేతెంచిరి. వారుత్సవముతో నూరిలోఁ బ్రవేశించుచున్నారు. (తెరలో మరల కిలకలధ్వని) అదిగో! వింటివా మంగళ వాద్యనాదములు!

ద్వితీయ—నీవాయుత్సవమును జూడఁ బోయెదవా?

ప్రథమ—అవును రమ్ము త్వరితంబుగఁ బోవుదము. మన మాలస్యము చేసిన వారప్పుడే వీధిలోఁ బ్రవేశింతురు.

ద్వితీయ—నీవుపొమ్ము నేను రాను.

ప్రథమ—ఏమి నీ కంతకోపము ?

ద్వితీయ—చిత్రకేతుఁడు సుగుణమణి యిచ్చవచ్చినవానిఁ బెండ్లి సేయక యింకొకనిని చేయుచున్నాఁడు అందుచే నాకు కోపము.

ప్రథమ—చాలు నీకోప మీపాటికి పొమ్ము [తెరలోఁ గలకలము.]

[ఇద్దఱును చెరియొకప్రక్కకు నిష్క్రమించుచున్నారు.]

రంగము. ౨

(సుగుణమణి ప్రవేశించుచున్నది.)

సుగు—(ఎవరోతరుముకొనివచ్చుచున్నటులభినయించి పరుగెత్తుచున్నది.) ఆహా! కళారత్నమా! కళారత్నమా! రక్షింపుఁడు రక్షింపుఁడు. ఈదుర్మార్గుఁ డెవఁడో నన్ను పెండ్లియాడెదనని నావెంటాడించి నన్ను తరుముకొని వచ్చుచున్నాఁడు. (మరలపరుగెత్తుచున్నది.) ఎవడవురానీవు?నన్ను పెండ్లియాడెదవురా? దుర్మార్గుఁడా!నీబోటి పాపాత్ములచేత చిక్కుదానను కానుపొమ్ము. నీత్రోవనుపొమ్ము (మరల దరుముకొని వచ్చుచున్నట్టు లభినయించును.) అయ్యో! ఏమి నాకీదురవస్థ వీఁ డెంతచెప్పినను నన్నువదలిపోకున్నవాఁడు. అరే నాదరిఁ జేరకుము నేను కళారత్నము నొమ్మును పెండ్లి యాడిన నాతనిఁ బెండ్లియాడవలయు లేనిచో నాప్రాణముల నీయూరిచివరనున్న తటాకములోఁ బడి వదలివేయవలయును. కాని నిన్నుమాత్రము పెండ్లియాడుదునని స్వప్నమందైనఁ దలంపకుము.ఓరినీచుఁడా! నీకును నాకును సాంగత్యమెక్కడిదిరా చిన్నతనంబునుండి కళారత్నమునే కోరియుంటిని. అట్టిదానను నిన్నువరింతునా? కళారత్నమా! వేగిరమురమ్ము. న న్నీనీచుని బారినుండి తక్షణంబునఁ దప్పింపుఁడు. ఇదిగో! నాపైఁబడినన్ను దీసికొనఁ బోవుచున్నాఁడు (అట్టులే యభినయించుచున్నది.)

అయ్యో! కళారత్నమా! నీవు రాణ్వైతివిగదా! ఇదిగో నాతండ్రియు గూడ నేతెంచి ఈతనికి సహాయభూతుండై లాగికొనుపోవుచున్నాఁడు. ఇంక నే నేమి సేతును? సత్వరంబుగరమ్ము. కళారత్నమా! నన్నీ క్రూరుల పెనుభూతములనుండి తప్పింపుము. అయ్యో! లాగికొని పోవుచున్నాఁడు. ఇంక గార్యము లేదు. కటకటా!

[ నేలపై వ్రాలి యేడ్చుచున్నది. ]

[ లేచి ] ఏమిటిది? ఇంతసేపటినుండియు నేను జేసినయల్లరియెవరైన వినియుందురేమో! అట్లయిన నాప్రయత్నములకు భంగము గలుగునుగదా? ఎంతపని చేసితిని! ఏమియా యాత్మదావస్థ నిజముగ నన్నవరో తరుముకొని వచ్చుచున్నటుల నే భావించితిని. ఆహా! అదియంతయుఁగల్లయే కదా! [ విచారమునభినయించుచు ] ఓకళారత్నమా! ఓమనోహరాంగుఁడా! ఓనా బహిఃప్రాణమా! ఇప్పుడు మీ రెక్కడనుండియున్నారు. జయపురములోనే యుంటిరా లేక పుష్పగిరికిఁ బోయియుంటిరా? అయ్యో జయపురములో నాతండ్రిపంపిన బ్రాహ్మణులునన్ను మిమ్ములనుండి వేరొనర్చినప్పటినుండియు నీసమాచారము తెలియకున్నది. ఇఁకఁ దెలసినను గార్యమేమి? ఈరాత్రితో నంతయుసరియ్యేగదా! ఓకళారత్నమా! ఓనా ప్రేమపుంజమా! ఓనావలపులప్రోవా! వింటిరా యీవార్త, రేపటిదినంబుననాకువివాహము నిశ్చయించినారు. పెండ్లివారలుప్రొద్దున నేతెంచియున్నారు. మాతండ్రి వివాహప్రయత్నములన్నియు సమగ్రంబుగఁ జేసియున్నాఁడు. ఇంతవరకు నామూలాగ్రంబుగవింటిరా? ఓకళారత్నమా! ఆపయి నింకొకముఖ్యవార్త గలదు. ఇదియుసావధానముతో వినుండు. అవార్త చెప్పుదునా? ఏవరికైన వినంబడునేమో! ఈయర్ధరాత్రింబున నెవ్వరీమాటవినవచ్చువారు. మంచిది చెప్పెదను. వినుట్కు

శ్రద్ధవహించియుంటిరా వినుండు. ఇదిగో యింకొక కొంచెము సేపటికి నేను బయలుదేరి యూరుచివరకుఁ బోయి యక్కడ నున్న చెరువులోఁ బ్రాణములఁ ద్యజింప నిశ్చయించుకొంటిని. ఇఁక మిమ్ములఁ గలసికొని పెండ్లియాడు భాగ్యము నాకు లేదు. ఇదిగో పోవుచుంటిని. [పోవుటనభినయించుచున్నది] ఓకళా రత్నమా! ఇంక నీతోఁ గొన్నిమాటలు చెప్పవలసి యున్నది. వానిఁ జెప్పినతరువాతఁ బోయి నాప్రయత్నముల నెరవేర్తును!

చ. మరవుఁడు నన్ను మీరు పలుమారు స్మరింపకుఁడీ య్యనామమున్
గరమనురక్తిఁ జెందిన మనంబు మరల్పుఁడి మాను డీవెతల్
స్థిరమతి జంద్రసేనుఁడు వచించినచొప్పునఁ బెండ్లియాడి, స
త్వరముగ సౌఖ్యసంపదల బాగుగనంది వసింపుఁడామెతోన్.

ఆమె మీకుఁ దగినదియయినను గాకున్నను బెండ్లియాడుఁడు. అంతే కంటె మీకు సౌఖ్యదాయకమైన సంబంధము నాకు వేరొకటిఁ గనపడలేదు. ఆర్యోత్తమా! ఆమెనువలసి యామెవలన సౌఖ్యం బులననుభవింపుఁడు. ఒకవేళ నేమైనను లోపము లున్నయెడల నోర్పు వహింపుఁడు.

ఉ. చిన్నతనంబుచేత నెటుచేసిన నోర్చి సహించుకొండు మీ
కన్న మరెవ్వ రాప్తులు సుఖప్రదులామెకుఁ గాన లోపముల్
మన్ననఁ జేసి యన్నియుఁ గ్రమంబుగ నేర్పున దిద్ది తీర్చి యా
కన్నియ నేలుకొండు సమగౌరవమిచ్చి కరంబుఁ బ్రేమతోన్.

ఇఁక జెప్పవలసిన దేమున్నది? అన్నియుం జెప్పితిని. ఓప్రియసోదరా! శ్యామకేతు నిన్నెడబాసి పోవలసినదినంబులు సంభవించినవి. ఇఁక మరల నిన్నుఁ జూచుట యెన్నడును లేదు. చిన్నతనంబు నుండియు నాయందత్యంతప్రేమ వహించి నావివాహోద్యమ ములయందుఁ దగి నన్ని ప్రయత్నములఁ జేసిన నీకు వందనంబు.

లాచరించుచుంటిని. సోదరభావంబుతోఁ జేకొనుము నీజీవితకాలములో నొక్కమారైనను కళారత్నముతో స్నేహంబు మానకుము. మనకట్టియమూల్యధనంబు వేరొకటిదొరుకదు. ఆతని స్నేహంబు నీకన్నివిధంబుల మేలొనర్చును. ఓతలిదండ్రులార! పసితనంబునుండియు నన్ననేకవిధంబులఁ గాచి రక్షించిన మీఋణంబు నేటితో సరియని చెప్పుటకెంతయు విచారమగ్నురాల నగుచుంటిని. మిమ్ముల నెడఁబాయుట మిగులసంతాపభాజనంబయిన కార్యమే కాని ప్రస్తుతమునకు నదియే నాకు సంతోషజనకమైనది. ఓతల్లి! తొమ్మిదినెలలు మోసి నన్నుబెంచి పెద్దదానినిగఁజేసిన నీవు నామరణవార్త వినినతోడ నెంత పరితపించెదవోగదా! అన్నా (కన్నీరువిడుచుచున్నది) ఓతండ్రీ! నాసకలసౌఖ్యంబుల కమితధనంబు వ్యయపరచి విద్యచెప్పించి జ్ఞానాభివృద్ధిగాంచిన నీవు నాచావు వినినంతట నెంతచింతించెదవోగదా! ఆహా! (కన్నీరువిడుచుచున్నది.) ఓయనుంగుసోదరా! నీవుగూడ నెంతవిచారంబుఁ బొందుదువో తెలియకున్నది. అయ్యో! (కన్నీరువిడుచుచున్నది.) ఏమి యిట్టినారక్తబంధువుల నందఱిని విడచి యీయకాలమృత్యువు వాతబడవలసివచ్చెను గదా! అన్నన్నా! వీరిని బాయు టెట్లు? ఓహో! నాప్రాణముల త్యజింతునా? మానుదునా? (ఆలోచించుచు) ఇఁక నాకుఁ గళారత్నము సంభవించుమార్గమేమియును గానరాకున్నది. కళారత్నముతో నివసింపని బ్రతు కేమిబ్రతుకు! ఆతని నెడబాసి యీ ధరాతలంబున జీవించుటకంటె ప్రాణములఁ ద్యజించుటయే యుక్తకార్యము సుగుణసాంద్రి! విద్యాభోజ! ఓకళారత్నమా! నేటితో మనకింక సరియేనా! అన్నన్నా! (కన్నీరుతో నేలవ్రాలుచున్నది.) (లేచియొకటోపివైపుచూచి దానినితెచ్చి) అత్యంత

ప్రయాసముతో నిన్నుఁ దయారుచేయుటకుఁ గావలసిన సాధన-
సామగ్రులన్నియు సంపాదించి యొక మాసముదినంబులకు
బూర్తి చేసితిని.

ఉ. అంచిత చిత్రకల్పనల నందముగాఁ బనిబూని నిన్నుగా
వించి మదీయనాథునకుఁ బ్రేమ మెయిన్ బహుమానమీయఁగా
నెంచితి నోకుశాయి! యిపుడేమి యొనర్చెద నక్కటక్కటా!
వంచనఁబోదినాను సెలవా యిఁక ముద్దులశాయి చెప్పుమా.

[ముద్దుపెట్టుకొని కన్నీరు విడచుచు దాని నప్పటిచోటఁ బెట్టుచున్నది.]

[ఒకవీణియనుజూచి] ఓవీణియ! ఇఁక నాకు నీమృదుగీతంబులు విను
భాగ్యము దొరకదుగదా! ఏమి సేయుదును? ఎంత దురదృష్టవంతు
రాల నయితిని. ఆహా!

ఉ. వీనుల కింపొనర్పఁగ నవీనములౌ మృదుగీతరాజముల్
మానితభంగి నేర్చి యకలంకమనస్కుని నామనోహరున్
బూని ప్రమోదవారధిని ముంచఁ దలంచితి; నేమి సేతునో
వీణియ! నేటితోడ మన వేడుక లింక దివంబుఁ జేరెనా?

[వీణయఁ గొంచెము వాయించి యచటనుండి పోవుచున్నది.]

(ఒక పుస్తకంబును బట్టుకొని) ఆహా! ఏమి నేటితో చదువుకొను
నదృష్టము పోయినదా? అన్నన్నా ఏమి సేయుదును. విద్యను
బోలిన వస్తువు ప్రపంచకమునందు మఱియొకటి లేదుగద.
[పుస్తకమువైపు చూచుచు]

ఉ. తేనెలు సోనలై దొరగు తీయనిమాటలు, సద్వికల్పనల్
మానితశైలియున్ లసదలంకరణంబు రసానుభావముల్
బూనిన పుస్తకంబ! నిను మొన్ననె వేడుకతో ముగించి సు
జ్ఞానము బొందితయ్యొ! కడసారి యె గ్రంథము ముట్ట నాకిఁకన్
[కన్నీరు విడుచుచు బుస్తకమునుంచుచున్నది.]

[ఆ సెంతనున్న కళారత్నముపటంబును చూచి తీసి] అయ్యయ్యో!
[మూర్ఛిలి నేలఁ గూలుచున్నది.]

లేచి పటంబునుజూచి] ఓ ప్రియస్నేహితుఁడా! నిన్ను పటంబుననైన జూచుటనిక సంభవింపదుగదా! ఎంత దురదృష్టవంతురాలనో గాని నిన్ను వివాహమాడు భాగ్యము సంభవించినది కాదు.

చ. కలకల నవ్వుచుండి, తెలిగన్నులఁ బ్రక్కను జూచుచుండి వం
జులతరహస్తమందుఁ బరిశోభితగ్రంథ మొకండు పట్టి, యు
జ్జ్వలముఖకాంతి గల్గి కడుసంతస మొల్కెడు నామనోహరున్
బడసిన ముద్దుచిత్రపటమా! సరియా మన కింక నేటితోఁ.

(ఏడ్చుచున్నది.)

ఈపటంబును నాతోడనే తీసికొనిపోయెదను (దృష్టినిగిడించి) ఇపు డెంతరాత్రియయినదో నేనిచటనే యాలస్యము చేయుచుంటిని. అయ్యో! నామరణంబుసంగతి మఱచిపోయితినా? త్వరగఁ బోయినంగాని లేనిచో నందఱికిం దెలియును. అప్పుడు ప్రమాదము పుట్టును. కావున నే నింక నిచ్చట నాలస్యము సేయఁ జనదు. (ఏదియో ఆలకించుచున్నటుల నభినయించుచు) అంత టను నిశ్శబ్దముగానేయున్నది. ఇది యేమనకనుమంచిసమయము. పోయెదనా?

సీ. సెల వొసంగదరె యోచిత్రపటములార
జీవములను బాయఁ బోవుదాన
[వానిని ముద్దుగొనుచున్నది.]
సెల వొసంగదరె యోసలిలయంత్రములార
జీవములను బాయఁ బోవుదాన
[నీటిని ద్రాగుచున్నది.]

సెల వొసంగెదరె నాచిన్నపొత్తములార
జీవములను బాయఁ బోవుదాన
[ఒకపుస్తకము దీసి మనస్సులోఁ జదువును.]
సెల వొసంగెదరె యోలలితభూజములార
జీవములను బాయఁ బోవుదాన
[పూవులచెట్లను కౌఁగిలించుకొనుచున్నది.]

ఆ. వె. శయ్యలార! సెల వొసంగెదరె నాకు
జీవములను బాయఁ బోవుదాన
[పాన్పుపైఁ బండుకొని లేచుచున్నది.] ఓకళారత్నమా!
శీఘ్రముగను మీరు సెల వొసంగెదరె నా
జీవములను బాయఁ బోవుదాన.

[నిష్క్రమించుచున్నది.]

రంగము—తటాకతీరము.

[ఒకకత్తిని చేతిలోధరించి కళారత్నము ప్రవేశించుచున్నాఁడు.]

కళా--[అత్యంతవిషాదముతో]

ఉ. చేరెడు నేత్రముల్, దళుకుఁజెక్కులు, నిద్దపుముద్దుమోము, వి
స్తారము వీను లింపలరు సంబెడుకొప్పు, మెరుంగుమోవి, శృం
గారరసప్రధాన మగుకాయము, గల్గిన నిన్నుఁ జూడ నే
తీరున సంభవించును సతీమణి, సద్గుణసాంద్ర నెచ్చెలీ!

అయ్యో! [నిట్టూర్పుపుచ్చుచు గన్నీరువిడుచుచున్నాఁడు.] ఎంతకష్ట
పడినను గార్యము లేకపోయినది. ఏమి సేయుదును? నాశక్తివంచన
లేకుండఁ దగినన్ని ప్రయత్నములఁ జేసితిని. జయపురంబునుండి
ఓసుగుణమణీ! నిన్ను విప్రులు తీసికొని వచ్చినతరువాత వారము
దినంబు లచ్చట వేఁచియుండి యప్పుడచ్చటకే తెంచెడు నోడనెక్కి
యాశ్రీనగరంబునకుఁ బ్రయాణము సేసి సాయంతనమ్మున దరికి

యూరున కేతెంచితిని అయ్యో! ఏతెంచినఁగార్యమేమి? అచ్చ
టనే నాకొకరు——ఆహా! ఎంతదరదృష్టవంతుఁడను రేపటియుద
యంబున నీకు వివాహమని చెప్పియుండిరి. అయ్యో! [నేలను
వ్రాలుచున్నాఁడు. లేచి] ఇఁక నీవునాకులభించుటదుర్లభంబని
యెంచిప్రాణత్యాగము చేయుయత్నించియీశ్రీనగరబాహ్యసీమ
నున్న నీతటాకంబుదరి కేతెంచితిని. కోమలాంగీ రేపటిదినంబున
నీవింకొకని పాణిగ్రహంబు సేసికొందువా? హా! దైవమా! ఆ
సుగుణమణికి నన్నెంతటిలో విరోధము సేసితివి. ఆమెకెంతటిలో
దూరమయిపోతిని? ఆమెను వదలి యీభూతలంబున జీవించిన
ప్రయోజనమేమి? ఇఁక నామె నాకులభించుట దుస్తరంబనియే
నిశ్చయించుకొనవలసి యున్నది. ఓసుందరీమణీ! నీవాభర్తను
జేకొని సకలసౌఖ్యంబుల ననుభవింతువాలనుభవింపుము. నీవు
సుఖంచుటకంటె నాకు వేరొండుచింత లేదు. నేనిందులో నబద్ధ
మాడితిని. అభర్తతో నీమె సౌఖ్యముల ననుభవించునా? వట్టి
మాట. ఆమెకు మిక్కిలి కష్టమేకాని మరియొకటికాదు. అయి
ననుగార్యముమించినది. సుఖమయిననుగష్టమయిననునోకన్యా
మణీ! ఇఁక నీవాతని కనుబద్ధురాలవై యుండవలయును. కావున

ఉ. ఇంపుగ సౌఖ్య మిచ్చి తనియింపు సతంబును ప్రాణనాథుఁజూ
పింపుము నమ్రభావము వివేకముతోడ నటింపు మింక సే
వింపుము న్యాయమార్గమును వీడక, యాతని కింపొనర్పఁ, గా
వింపుము కార్యపద్ధతులఁ బ్రీతిమెయిన్ జరియింపు మెప్పుడున్

[కన్నీరువిడుచుచున్నాఁడు.]

ఓసుగుణమణీ! నీసౌఖ్యం బింక నాకు లభింపకపోవుట సరియేకదా,
నిన్నుజూచుటకైన వీలు సంభవించినదికాదు. ఆహా! ఏమిసేయు
దును? నీవిసమ్మయంబున నాకొక్కసారికనుబడరాదా? నిన్నుఁ

జూచునిమిత్త మింతనర కేతెంచితిని ఇక నాపయిని నిన్నుఁ గాంచుటెట్లు? నీవెచ్చటనో యంతఃపురసీమలలో హాయిగా నిప్పుడు నిద్రించుచుంటివి గదా! నిన్నీసమయంబున గలసికొను టెట్లు? అయ్యో! [నిట్టూర్పువుచుచు] ఓసుగుణామణీ! ఓప్రాణసఖీ!

సీ. పెండ్లి గాకుంటచే బెనగి నీచెక్కుల
నసుచితం బనుచు ముద్దాడనైతి
మారుడొంచు నటించు భయమంది మిక్కిలి
యింపుగా నిను కౌఁగిలింపనైతి
మర్యాదగాదంచు మది నెంచి నీదివ్య
గాత్రంబుఁ గండ్లారఁ గాంచనైతి
పలుమారు పల్కుటల్ భావ్యంబు గాదంచు
నోరూర మాటాడ నేరనైతి

ఆ. వె. నకట!. యెంత వెట్టినైతి నింకేమిటి
యోమనోహరాంగి యోమదియ
ప్రాణమా! వియోగవనదిలోఁ బడినాఁడ
విడుతుఁ బ్రాణములను వేగ నిచట.

ఓనామనోహారిణీ! నీకీదుర్వార్తవిన్నవించువారెవరు? నీవు నామరణ వార్త విని యెంతసంతాపము నొందుదువు గదా! అయ్యో! మనకింక నేటితోసరియేనా? ఓచిత్రకేతు! నేనిదె ప్రాణములఁ ద్యజించుచున్నాఁడ, మీరు నాకుఁజిన్నతనంబునుండియు గావించినమేలున కిదిగో కృతజ్ఞతాపూర్వకవందనంబులు సేయుచుంటిని. ఓకళావతీ! నీకును నివియే వందనంబులు. ఓశ్యామకేతు! నాకనేకవిధంబులసహకారివై నాయున్నతస్థితినిఁగోరుచు భ్రాతృవాత్సల్యమును జూపిననీకు మనఃపూర్వకనమస్కారము లాచరించుచున్నాను. ఓనాప్రియసఖి! ఓప్రేమపుంజమా! ఓవల

పుణ్యవంతీ! నీకు ననేక వందనంబులాచరించుచున్నాను. [ఒకచేతి రుమాలు నీయుచు] నీవు ప్రేమతో నొసంగిన చేతిరుమాలును ప్రాణప్రదంబుగ దాచియుంటిని. ఇంతకుఁ దప్ప నీనామజ్ఞాప కార్థము మరియొకటి నాయొద్ద లేదు.

[చేతిరుమాలువైపు చూచుచు]

సీ. ఘర్మాంబువులు వాపఁగాఁ జేయ నాముద్దు
ప్రతివకు సేవన వగుదు కాదె?
వనకేళి నీరెండ వాపంగ నాచిన్ని
ముగుదకుఁ జిరుగొడు గగుదు కాదె?
తోరంపుఁ గన్నీరు దుడువంగ నాబహిః
ప్రాణంబునకుఁ జెలి వగుదు కాదె?
ఒకనాఁడు సహబాయ కుండంగ నామనో
హారిణి కనుచరి వగుదు కాదె?

గీ. చేతిరుమాల! నీవు నిర్జీవ మయ్యుఁ
జాలయుపచారముల జేయఁ జాలినావు
జీవ ముండిన నాకంటె నీవె యెంతొ
ధన్యురాలవు నినుఁబోలు పుణ్యు లెవరు?

[రుమాలును ముద్దుపెట్టుకొని కంట్లనద్దుకొని మెడకుఁజుట్టుకొని విషాదముతో] అహా! రాత్రి విశేషమయినట్టు లున్నది. [కత్తిని తీసి] ఓసుగుణామణీ! సుగుణామణీ! సుగుణామణీ! ఇదె పోవుచున్నాఁడ.

[సుగుణామణి ప్రవేశించుచున్నది.]

సుగు—ఏమి యిచ్చట నేదియో శబ్దము వినవచ్చుచున్నది. అయ్యో! మనప్రయత్నము సఫలీకృతము గాకపోవునా యేమి? [ఏదియో వినుచున్నటుల నభియయించుచున్నది.

కళా—ఉ. మించినప్రేమ నిర్దళము చిన్నతనంబుననుండి యొక్కటై
కాంచితి మెల్ల సౌఖ్యములఁ గావున నిప్పుడు నామెఁబాసి జీ

వించుట సూర్యకాంతి ప్రభవింపని దుర్దినమట్లు గాసన

భ్యంచితలీల నిష్ఫలి ప్రాణములకా ద్యజియింతు దైవమ

(కత్తినెత్తి) అహా! సుగుణమణీ! [కంఠములోఁ బొడిచికొని ప్రా

ముల విడుచుచున్నాఁడు.]

సుగు—(చేరంజని) హా! కళారత్నమా! (మూర్ఛిల్లుచు) హా! క

రత్నమా! (కన్నీరు విడుచుచున్నది.)

సీ. సత్కాంతితోఁ గూడి సంతోషజనకమౌ
ముద్దుమోమా యిది పుణ్యచరిత!
అత్యంతభూతదయార్ద్రదృష్టుల నీను
నేత్రంబులా యివి నీతిసాంద్ర!
సద్వాక్యముల బోధ సల్పఁ గల్గినయాస్య
రాజమా యిది భవ్యతేజరూప!
సత్కార్యముల నెన్నొ సల్పఁజాలిన దివ్య
హస్తంబులా యివి యమలహృదయ!

తే. గీ. నీరు పోయిన వెన్కను మిత్రవర్య!
బ్రతుకు టెల్లను మరి దుఃఖభాజనంబు
గాన వచ్చుచుంటిని యిదే నేను గూడఁ
జేరఁదీయుఁడు నన్నతిశీఘ్రముగను.

రత్నము చేతిలోని కత్తితోఁ బొడిచికొని ప్రాణములవిడుచును.]

[తెరవాలును]

సమాప్తము.





శ్రీచింతామణిముద్రాక్షరశాల:—రాజమండ్రి